**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వాసుదాస.

అస్పృశ్యత / వాసుదాస విరచితము.- Anantapur : Pinakini Press, 1925.

73 p. ;18 cm.

Record no. 214

Vāsudāsa.

Aspṛśyata / Vāsudāsa viracitamu.- Anantapur : Pinakini Press, 1925.

73 p. ;18 cm.

Record no. 214

శ్రీరామ జయం.

# అస్పృశ్యత

వాసుదాస రచితము.



PRINTED AT PINAKINI PRESS,
ANANTAPUR.
1925

దీని వెల ౪, అణాలు.



*

శ్రీ క్రియాశక్తియొడయ రాంధ్ర పరిషద్ద్వితీయ వార్షిక
సభయందు బ్ర॥ శ్రీ॥ వావిలకొలను సుబ్బరావుగారి
యధ్యక్షకోపన్యాసము.

# అస్పృశ్యత

మహాశయులారా!

ఇంతవఱకు సభ్యార్థుల పరీక్షలు ముగిసినవి. ఇఁక నా పరీక్ష నిలువయున్నది. అందు నేనెట్లు లుత్తీర్ణుఁడ నయ్యెదనో.

శ్లో॥ "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తంహి దేవ మాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే"।
— శ్వేతాశ్వతరోపనిషత్తు

ఇట్టి భగవంతుఁడు మదీయాత్మ బుద్ధి ప్రకాశ కరుఁడై లోకమునకుఁ బథ్యమయిన దానినే నానోరఁ బలికించును గాక.

సభలో నస్పృశ్యత విషయమై వాద ప్రతి వాదములు పూర్ణముగ జఱిగెనేని యంత ముండదు. కొంద

ఱు శాస్త్రబద్ధులనఁగాఁ గొందఱుచ్ఛృంఖలులై మాకు శాస్త్రముతోఁ బనిలేదనిరి. కొందఱు శాస్త్రము లంగీకరింపఁ దగినవే యైనను నిప్పటి దేశ స్థితి గతులఁ బట్టి వానిని మన కుపకరించు నట్లు సవరింపవలయు ననిరి. సమాన ప్రమాణములు గలవారు వాదించిన నెన్నాళ్ళకైనఁ బర్యవసానము కలుఁగవచ్చుఁగాని సప్రమాణులకు నప్రమాణులకు నెన్నఁటికైన సామరస్యము కుదురునా? కలహములు పెరుఁగుటయే ఫలము. కావున నుపన్యాసకాల మొక్కొక్కరికిఁ బది నిమిషములని మాత్రమే విధించితిని. ప్రత్యుత్తరముల కెడమీయ నైతిని. దీనికి సభ్యులందఱు క్షమింతురు గాక.

## అశాస్త్రబద్ధుల కుపదేశము నిరర్థకము.

లోక మర్యాద ననుసరించి నా యభిప్రాయమును నేను దెలుపవలసినదే కాని దాని వలన నేమి ఫలము గలుఁగఁగలదు? పంచములను స్పృశించిన దోషము లేదని నేను జెప్పినంత మాత్రమున నాత్మార్థ పృథివీం త్యజేత్తను సూక్తి నెఱింగిన శిష్టాచార సంపన్నులయిన యాత్మజ్ఞులు పోయి చండాలురఁ గౌఁగిలింతురా? పంచముల స్పృశించిన దోషమని నేనుజెప్పినంత మాత్రమున నెట్టులేని స్వరాజ్యస్థాపనమునకుఁ గంకణము గట్టుకొనిన రాజనీతి వేదులు వారిని డాఁకక మానెదరా? కావున నిదినాకువ్యర్థ ప్రయాసమని యెఱుంగుదును.



శ్లో॥ "జన్మాంతర సహస్రేషు, యాబుద్ధి ర్భావితా పురా
తా మేవ భజతే జంతు, రుపదేశో నిరర్థకః॥

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతింయాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥
భ॥గీ॥-3-33

యని కదా పెద్దలు వచించిరి.

ఈ రెండు తెగలవారు గాక నడిమి తెగవారు కొందఱు గలరు. వీరు స్వయముగ నిర్ధరించుకొను శక్తి లేని వారయ్యు యుక్తాయుక్తములు చెప్పినఁ బరిశీలించి శ్రేయస్కర మార్గమునఁ బోవ బుద్ధియు శక్తియుఁ గల వారై చిరకాలాగతమైన శిష్టాచారము నిష్కారణముగ నుండునా? అట్టిదాని నెట్లు విడువ వచ్చును? విడిచిన నేమి కీడుమూఁడునో? యనియు నధునాతన జనులలో గొప్పవారు స్పృశింపవచ్చు ననుచున్నారే వారు మనకేల బోధింతురు? మనము చెడిన వారికేమి లాభము కలదు? అనియు శంకాందోళిత చిత్తులయి యెటు చేయఁజాలక త్రొక్కులాడుచున్నారు. ఇట్టి వారికి నా యభిప్రాయ ముపకరింప గలదని నమ్మెదను.

## నేను గ్రామఫోను గాను

ఒకానొకరు మహాత్ముఁడు గాంధిగా రుపవాసమున్నారు. వారి యభిప్రాయమునకు మీరు విరోధముగ

జెప్పిన వారు నొచ్చుకుందురు. ఇట్టి స్థితిలో వారిమనస్సు మీరు నొప్పింప రాదని బోధించిరి.

గాంధి మహాత్ములవారి యభిప్రాయమునకు విరుద్ధముగ నేను జెప్పిన వారు నొచ్చుకొందురా? వారట్టివారు గారు. వారు పలుమారేమి బోధించు చున్నారో మీరెఱుఁగరా? నేను జెప్పితినని మీరాచరింప వలదు. మీరాలోచించి తృప్తి పడిననే యాచరింపుఁడు అని ఘంటా ఘోషముగఁ జెప్పుచున్నారు గదా? ఆ యాజ్ఞ ప్రకారము నేను వర్తించిన నాపై గినియుదురా? ఇంతకు నేనెంతటి వాఁడను? నేను జెప్పినంత మాత్రముననే వారి యనుచరు లందఱు వారిని విడనాడుదురా? భగవంతు డొక్కొక్కని కొక్కొక్క తలయేల యిచ్చెను? ఆలోచించు బుద్ధి శక్తియేల యిచ్చెను? ఒకడు పోయిన త్రోవ నంధ పరంపరాన్యాయమునఁ బోవుటకు మనము మనుష్యులముగాని గొఱ్ఱెలము గాము. ఇంతకు నాయభిప్రాయము మీరెఱుఁగరు. కావున నేను జెప్పునది సాంతముగ విని మీరు విద్యావంతులు బుద్ధిమంతులు గావున స్వశ్రేయ స్సాధ్యములరై చక్కఁగాఁ బరామర్శించి మీచక్కని శిక్షిత బుద్ధి కేది యుక్తమని తోఁచునో యట్లు నడవ వలయునని ప్రార్థించెదను. బావిలోఁ దూఁకినను గన్నులు తెఱచుకొని దూఁకునది బావి యని తెలిసి దూఁకుడు. గుడ్డివానివలె దొరలకుఁడు. ఇది మనుష్య ధర్మము. ఒకరు మెచ్చుకొందురను ప్రీతిచేతగాని, వేఱొకరు నొచ్చుకొందురను భీతిచేతఁగాని నా యంతఃకరణమును నేనుజంపఁజాలను. “నాత్మాన మవసాదయే” త్తను కృష్ణ వాక్యమే మనకుఁ బ్రమాణము. ఈ క్రింది వాక్యరత్నములను మీకుఁ గానుకగ నర్పించెదను.



“I want you to think for yourself and if in the end you come to hold views opposed to mine I shall not be grieved in the test. But I should be very sorry indeed if you allowed yourself to come to hasty conclusions or to form your opinions only from what you hear from those with whom you happen to associate however great they may be in other respects. Divergent views may honestly be held of the same question and unless you can get into touch with these different views and duly weigh and consider them, you will not be able to form a corrct opinion. Do not make the mistake at your age of confining the dicussion of any question with people who are all of the same school of thought. If you want to get at the truth to test the value of your own conclusions or of those who hold a contrary view, make it a point always to argue against the view put forward by those with whom you are discussing, even though you happen to agree with them you will find that an excellent way to prevent yourself from gradully and unconciously absorbing the views of those you associate with always a difficult thing to avoid. Do not be in a hurry to formulate definite opinions.”

(Modern Review.)

ఆర్య ధర్మవృద్ధిఁ గోరువాఁడనగుటను, స్థానవశమునను మీయాజ్ఞచేతను దప్పించుకొనవే ఉపాయము లేకుండుటను, నా యభిప్రాయమును జెప్పవలసి వచ్చి చెప్పెదను. భిన్నాభిప్రాయులు క్షమింతురు గాక. అస్పృశ్యము = తాఁకరానిది. అస్పృశ్యుఁడు = తాకరాని వాఁడు. అస్పృశ్యత = తాకరామి. ఇది శబ్దార్థము. "పంచములఁ దాఁకవచ్చును. తాఁకిన దోషములేదు. వారు మనయట్టి మనుష్యులే. పంచమ జాతి యనునదియే లేదు. వర్ణములు నాలుగే. అయిదవది లేదు. అది యశాస్త్రీయము" అని యీరీతిగఁ గొందరును, వారస్పృశ్యులు. వారిని దాఁకిన దోషము. శాస్త్రము ప్రమాణము. అనికొందఱును మన దేశమున వాదించుచుండుట నే నెఱుంగుదును. ఆ వివాదమే యిచ్చటికి నవతరించినది. మీరు వినఁగోరినది నాయభిప్రాయమే కాని గ్రామఫోనువలె నితరుల పలుకులు పలుకుటఁగాదు గదా. కావున నా తెలివి తేటల కొలఁది నేను యోచించి నిశ్చయించుకొన్న విషయమునే చెప్పెదను. ఈవిషయమై యీ సభలో నిప్పుడు జరిగిన వాద ప్రతివాదములు మీరును విన్నవారే కావున వానినెల్ల ననువదించి వృథా కాలహరణము సేయను. అన్నిటికిని సమాధానములు మున్ముందు రాగలవు.

### ధర్మ సందేహములందు శాస్త్రము ప్రమాణము.

ఆర్యులారా! పంచము లస్పృశ్యులా స్పృశ్యులా



యను సందేహమును దేని నాధారముగఁగొని యిదమిత్థమ్మని పరిష్కరింప వలయును? దేవుఁడు గలఁడా లేఁడా యను సందేహము కలిగినపుడు శబ్దము (వేదము) ప్రమాణము కాని యనుమానాదులు ప్రమాణములు గావని శాస్త్రయోనిత్వాత్తని బ్రహ్మసూత్రము శాసించుచున్నదిగదా. అట్లే ధర్మవిషయమున సందేహము గలిగినపుడు ధర్మ శాస్త్రములు ప్రమాణములు కాని తదితరములు ప్రమాణములు గావు. శాస్త్రము ననుసరించిన యుక్తులు సూక్తులగును. పంచమ వేదమునందలి భగవద్గీత నందఱు నుపనిషత్సారమనియు సాక్షాద్భగవంతుఁడు స్వయముగ నుచ్చరించిన దగుటచే నది శ్రుతియే కాని స్మృతి యనుటకూడ సరిగాదని మనపెద్దలు చెప్పిన వాక్యమును మన మందఱ మంగీకరించి యున్నారము గదా. అట్టి భగవద్గీత యందు,

శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం॥

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే, కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మకర్తు మిహార్హసి॥

అని కానవచ్చుచున్నది కదా; శాస్త్రములకేల యింతబలమని యందురేని "శ్రుతి స్మృతిర్మమైవాజ్ఞా" యనియు

శ్లో॥ ప్రకాశయితు మాత్మానం భక్తానాంహిత కామ్య

యా॥ అవతీర్ణో జగన్నాథః శాస్త్రరూపేణవై ప్రభుః॥
తస్మాచ్ఛాస్త్రే ధృతిః కార్యా భక్తిర్మోక్ష పరాయణైః
అభక్తస్యపరే శాస్త్రే భగవాన్న ప్రసీదతి॥ యనియుఁ

గలవుగదా. కావున మనమిప్పుడు శాస్త్రమును బ్రమాణముగఁగొని దీనిని బరిష్కరింపవలసి యుండును. శాస్త్రములతో మనకుఁ బనిలేదను వారితో మనకు బనిలేదు. తండ్రి వాత్సల్యమెట్టిదో దానికి నూఱంత లెక్కువ వాత్సల్యము గలది శాస్త్రము. శాస్త్రములే లోకులకుఁ గన్నులు. కన్నులు పొరపడునుగాని శాస్త్రములు పొరపడవు. ఇంద్రియములకు విషయములుగాని వానినిగూడ శాస్త్రము లెఱింగించును. కావున శాస్త్రము లేమి చెప్పుచున్నవో చూతము. ఈ సందర్భమున

శ్లో॥ శాస్త్రాభ్యాస పరాణాంచ కర్మచాననుతిష్ఠతామ్
హృదయే భక్తిహీనానాం నశాస్త్రంతు ప్రకాశతే॥
అభక్తానా మనర్హాణాం సచ్ఛాస్త్రం శ్రూయతేపివా
అన్యథా ప్రతిభాత్యేవ విషాక్తానాం యథాపయః॥
తామసానాం విమూఢానాం పతితానాం భవార్ణవే
విపరీతంచ సకలు ధర్మజ్ఞానం ప్రకాశతే॥

యనువాక్యములు స్మరణీయములు.



**ఇంద్రియములకు స్పృశ్యాస్పృశ్య విషయములు కలవా లేవా?**

ఈ దేహమునందు కర్మేంద్రియము లైదు గలవు. వాక్పాణి పాదపాయూపస్థములు కర్మేంద్రియములు. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు జ్ఞానేంద్రియములు. శబ్దస్పర్శ రూప రస గంధములు గుణములు. అన్నియింద్రియములకుఁ గార్యము లివియని యకార్యము లివియని గుణ దోషములను శాస్త్రములు ఘోషించుచున్నవి. కన్నులు గొన్ని పదార్థములను జూడవచ్చునఁట. కొన్నిటిని జూడగాదఁట. ఉదయమున మలదర్శనమాయువును క్షీణింపఁజేయునఁట. ఉదయాస్తమయములసూర్యుని జూడరాదఁట. నగ్న స్త్రీలను జూడరాదఁట "యానారూఢం యతిం దృష్ట్వా సచేలస్నానమాచరేత్" వాహనమెక్కిన సన్న్యాసిని జూచినఁ గట్టువస్త్రముతో స్నానము చేయవలయునఁట. "రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" రథస్థుఁడైన విష్ణువును జూచిన మరల జన్మము లేదఁట. ఉదయమున నద్దము లోనగు మంగళ పదార్థముల జూడవలయునఁట. కమలాక్షు వీక్షించు కన్నులే కన్నులఁట. దృష్టి విషయమై యిట్టివి పెక్కులు గలవు. ఇట్టులే చేతులు కాళ్ళులోనగు నన్ని యింద్రియములకు నిషిద్ధ కార్యములు కలవు కానిలేకపోలేను. దీని నందఱంగీకరింపక తప్పదు. త్వక్కు (చర్మము) గుణము స్పర్శము. కావున దానికిని స్పృశ్యాస్పృశ్యములు కలవని శాస్త్రములు చెప్పుచున్నవి.

శ్లో॥ అస్పృశ్యమస్పృశంతీయా స్పృశంతీ స్పృశ్యమేవచా
తతోప్యలోలుపాసద్భిః శుద్ధాన్యాగిణి కథ్యతే॥

అని త్వక్షు శుద్ధిలక్షణము శాస్త్రము చెప్పెడిని. అంటు రోగము లనుభవ మందున్నవి.

## అస్పృశ్యత శాస్త్రీయమా?

### అస్పృశ్యములు.

చండాల సూతికోదకీ పతితశవ ఖరశ్వానాది స్పర్శనే, తత్స్పృష్ట స్పర్శనేచ, శూద్రాది స్పర్శనే, కాక కుక్కుట గృధ్ర విడ్వరాహ ఉష్ట్రవృక గోమాయు వానర మానుషాస్థి రక్త విష్టామూత్ర పురీష రేతో మజ్జార ఖ్యాకర్దమతోయాది స్పర్శనే భోజనే బిడాలపుచ్ఛ స్పర్శనేచ శావే శవగృహ గమనే శవానగమనాదిషు చ స్నానం కర్తవ్యమ్.

—ప్ర॥ ధర్మశాస్త్రము.

ఇప్పుడు బుద్ధిమాలిన బ్రాహ్మణులు కుక్కలను దాకుచున్నారుగదా. దానిఫలమిట్లు భారతమున మహాప్రస్థానపర్వమున వ్రాయఁబడియున్నది.

ఇంద్రుడు. స్వర్గేలోకే శ్వవతాం నాస్తిధిష్ణ్య
మిష్టాపూర్తంక్రోధవశాహరంతి
తతో విచార్య క్రియతాం ధర్మరాజ
త్యజ శ్వానం నాత్ర నృశంస మస్తి॥



మఱియు

చండాలాదేస్తు సంస్పర్శే, వారుణం స్నానమాచరేత్॥

వృద్ధ మనవు.

ఛాయామంత్య శ్వపాకాదేః, స్పృష్ట్వాస్నానం సమాచరేత్ చత్వారింశత్పదా దూర్ధ్వాం, ఛాయాదోషోనవిద్యతే

స్మృతిరత్నము.

### ప్రాయశ్చిత్తములు

చండాల స్పర్శనేచైవ, సచేల స్నానమాచరేత్
చండాలైస్సహ సుప్తంతు త్రిరాత్రి ముపవాసయేత్

పరాశర.

శ్వపాకం వాపిచండాలం, విప్రస్సంభాషతే యది
ద్విజై స్సంభాషణం కుర్యాత్, సావిత్రీంతు సకృజ్జపేత్
చండాలస్పర్శనే సద్యః, ఆదిత్య మవలోకయేత్
యుగం యుగద్వయంచైవ, త్రియుగంచ చతుర్యుగమ్
చండాల సూతికోదక్యా, పతితా నామథఃక్రమాత్॥
చండాల భాండ సంస్పృష్టం, పీత్వా కూపగతం జలమ్
గోమూత్ర యాచకాహారః త్రిరాత్రాచ్ఛుద్ధి మాప్నుయాత్
చండాల నిర్మిత వాస స్సర్వదా పరివర్జయేత్

అని శాస్త్రములు స్పర్శదోషమును బ్రాయశ్చిత్తమును నిట్లు విధించుచున్నవి.

ఈస్నానమైనను వేడి నీళ్ళతోఁ జేయరాదట.

శ్లో॥ మృతే జన్మని సంక్రాంత్యాం, శ్రాద్ధే జన్మదినే తథా
అస్పృశ్య స్పర్శనే చైవ, నస్నాయీ దుష్ణవారిణా
సగోహత్యా కృతంపాపం, ప్రాప్నోత్యేవ నసంశయః
వృద్ధ మనువు.

అపవాదములు.

ఈ యస్పృశ్యత కొన్నిసమయములందు లేదఁట.

శ్లో॥ తీర్థే, వివాహే, యాత్రాయాం, సంగ్రామే, దేశవిప్లవే
గ్రామదాహే, ప్రవాసేచ, స్పృష్టి దోషో నవిద్యతే॥
పరాశర.

విష్ణ్వాలయ సమీపస్థాన్, విష్ణుసేవార్థమాగతాన్
అంత్యజాన్ పతితాన్వాపి, స్పృష్ట్వా నస్నాన మాచరేత్॥ పాద్మ.

తీర్థ వివాహయాత్రా యుద్ధ దేశవిప్లవ గ్రామదహన ప్రవాసములందును విష్ణ్వాలయ సమీపమునందు విష్ణుసేవకై వచ్చిన పంచమాదులను తాకిన దోషము లేకుండుటే కాదు. తాఁకిన దోషమని తలఁచినను పాపము వచ్చునఁట. అట్లు తాకుట గంగాస్నానమున కన్న నెక్కువట.

శ్లో॥ విష్ణ్వాలయాంతిక స్థానాం, తత్సేవార్థ ముపేయుషాన్
స్పర్శ స్సర్వాపగాస్నానా, దతిరిక్తత మోమతః



ఉత్సవే వాసుదేవస్య, యస్స్నాతి స్పర్శశంకయా
స్వర్గస్థాః పితరస్తస్య, పతంతి నరకే క్షణాత్॥

ఇట్లు విష్ణు సేవకైవచ్చి విష్ణ్వాలయ సమీపమందుండు చండాలాదులను దాఁకుట గంగా స్నానమునకంటె నెక్కుడఁట.

ఉత్సవాది దినంబులం గాక తక్కిన దినంబుల నద్యాదుల స్నానముచేసి మడుఁగులు కట్టుకొని వెలుపలఁ బోవునపుడు చేత జలపాత్ర ముండినచోఁ జండాల దర్శనాలాప స్పర్శ దోషములవలన విముక్తుఁ డగునఁట.

శ్లో॥ ఉదపాత్రం కరే ధృత్వా, బహిర్యాతి యదిద్విజః
చండాల దర్శనాలాప, స్పర్శదోషై ర్విముచ్యతే॥

ఇది నేఁటికి నాచారమందున్నది.

ఇత్యాదులు సద్యస్స్ఫురణమునకు వచ్చినవి వచించితిని. వెదకిన నింకను లభింపఁగలవు. స్పృశ్యాస్పృశ్యములను విధినిషేధాదులను శాస్త్రములు స్పష్టీకరించి యున్న వనుటకై దిక్ప్రదర్శనముగ నివి యనువదించితి. దీనివలనఁ జండాలాదు లస్పృశ్యులని శాస్త్రము వలనఁ దెలిసికొంటిమి. ఈ వాక్యము లస్పృశ్యత శాస్త్రీయము కాదను వాదమును ఖండించుచున్నవి.

## శాస్త్రముల సవరింపవలయునా?

శాస్త్రము లందున్నను నవి ప్రకృత కాలానుగుణముగ వానిని సవరింపవలయునని తలంతుమేని పంచములను మాత్రము తాకిన దోషము లేదని సవరింపవలయునా లేక యీ సముదాయములోఁ జేరిన మట్టు తలన్న, మల మూత్రములను శవములను గుక్కలను మఱియు నితరములగు నస్పృశ్యములను గూడఁ దాకిన దోషము లేదని సవరింపవలయునా? తత్తదభిమానులు వానిని గూడఁ దాకిన దోషము లేదని సవరింపవలయు నందురు గదా. మఱియు నొకఁ డస్పృశ్యత గుఱించి సవరింపవలయుననును. వేఱొకఁడు విధవావివాహము విధిగ సవరింపవలయు ననును. మఱియొకఁడు రజస్వలా వివాహము శాస్త్రీయము చేయవలయుననును. ఒండొకఁడు రజస్వలానంతర వివాహము కావలయు ననును. ఒకఁడు డాంజిలీస్ హొటల్ లోను రైల్వే రెస్టారెంటులో భోజనము చేసిన దోషము లేదని శాస్త్రము నందు వ్రాయవలయుననును. ఇఁకఁ గొందరు మెక్ డావల్ నుండి కెరిసిన్ ఆయిల్ అని లెక్కలు వ్రాయించి సారాయము తెప్పించి త్రాగిన మద్యపాన దోషము పోవునని శాస్త్రమునం దెక్కింపుఁడనును. కొందరు వేశ్యాసంగమము పరమ పవిత్రమని వారి కిచ్చునది సత్పాత్ర దానమని దానములు దశ విధములు గాక యేకాదశ విధములని గో భూ తిల హిరణ్యాది శ్లోకముల సవరింపుఁడనును.



శ్లో॥ రజస్వలాయాం యదిపూర్వకాలే, సంభోగ కర్మక్రియ తేంగనానామ్, తదూర్ధ్వతో గండక దోషనాశో భర్తశ్చిరాయురితి రుద్రవాక్యమ్॥

అను దరిద్ర శ్లోకమును శాస్త్రమునం దూర్పుఁడని కొందఱందురు. ఇట్టులే కొందఱు కన్యా శుల్కములను పేరిటి యార్ద్ర మాంస విక్రయమును, గొందరు క్రాపింగులను, బ్రౌజర్లు దొడుగు కొనువారు నిలఁబడి యుచ్చపోయుటను, జారత్వమును, చౌర్యమును శాస్త్రోక్తములఁ జేయవలయు నందురు. ఇఁక స్త్రీలలో వంకర పాపటల పాటల గంధులు, ముంజేతి జాకట్ల మించుఁబోఁడులు, శూన్యలలాటముల సీమాటులు, బూట్సు కాళ్ళ యిల్లాండ్రు, పరకీయలు, సామాన్యలు, లోనగు స్త్రీలేమేమి సవరింపుమందురో! క్రాపింగులు, కాలర్లు, బ్రౌజర్లు మగవారి నన్ని మారుమ వ్రాయుమందురేమో! ఇట్టులే వారివారి యిష్ట ప్రకారము శాస్త్రములకు శస్త్రచికిత్స చేసిన యెడల నది శాస్త్రమనఁబడునా?

## హిందువులు లేరా?

ఈ కాలమున హిందువే లేడు గావున హిందూ శాస్త్రము లనుసరణీయములు కావని యొకరనిరి. ఎంత సాహసము! వక్రవాద మెంతటి కక్కుర్తికి బాలుపడఁ జేయుచున్నది. రామకృష్ణ పరమహంస యెవరు? వారి శిష్యులందఱెవరు? భ్రాంత మండలి మహాస

ధ వారంద రెవరు? చైతన్య-రామానంద-శంకర-రా
మానుజ-మధ్వాచార్య మతావలంబులందు సదాచార
సంపన్నులయి యుండువారెవ్వరు? మహాత్ముఁడని జెప్పఁబ
డు గాంధిగారెవ్వరు? నేను హిందువునో నాకు హిందూ
మతమునకన్న శ్రేష్ఠమైనది వేఱొకటి లేదోయని
కంఠము శోషిల ఘోషించుచున్నాడు గదా.
వీరందరు హిందువులు గాకున్న క్రై
స్తవులా? మహమ్మదీయులా? వేద మతావలం
బుల శాస్త్రబద్ధులందఱు హిందువులే. మన మంద
ఱమిచ్చట హిందువులమని సభచేరి యీ విషయమా
లోచించుచున్నాము గాని మహమ్మదీయులమని క్రైస్త
వులమని తలఁచి కాదుకదా? కావున మనము హిందు
వులమే. మనకు శాస్త్రమే ప్రమాణము.

## అస్పృశ్యత నిష్కారణమా?

శాస్త్రములు చెప్పినఁ జెప్పునుగాక, అస్పృశ్యతకుఁ
గారణము లేదనియొకరనిరి. కారణమే లేదా? వీరికిఁ దెలియ
దా? కారణమే లేదని వీరెట్లు సిద్ధాంతము చేసికొనిరి. వీరు శా
స్త్రములు చదివిరా? పెద్దల నడిగిరా? రెండును లేదు.
"ప్రయోజనమనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే" యన్న
ట్లు ప్రయోజనము నుద్దేశింపక మందుఁడు కూడ నేకా
ర్యము చేయఁబూనఁడనుకదా, ఇఁక నిష్కారణము
గ శాస్త్రములేల యట్లు చెప్పును. చిరకాలముగ శిష్టా



చారముగ నది యేల యెన్నఁబడును? మనయాచార
ములనేక శాస్త్రసారములు. జ్యోతిషములఁబట్టి కొన్ని,
వైద్యశాస్త్రములఁబట్టి కొన్ని, వేదాంతముఁబట్టి కొన్ని,
యోగశాస్త్రము ననుసరించి కొన్ని, నీతి ననుసరించి కొ
న్ని వర్ణాశ్రమానుసారముగ నేర్పడినవి.

అన్ని విషయములందు సంపూర్ణజ్ఞానము గలిగిన
జ్ఞాన చక్షుష్కులు యోగులు సర్వజ్ఞులు నేర్పరచినవి
శాస్త్రములు. ఈ శాస్త్రములు సనాతన ధర్మములని
చెప్పెడునవి. సర్వకాల సర్వావస్థలయందు మార్పుఁజెం
దక యుండును. కొన్ని ప్రకృతి పరిణామమునకు సంబం
ధించినవి. కాలానుగుణముగ మారుచుండును. అభిప్రా
య భేదములు యుగ యుగాంతరముల మార్పులు నీ ధ
ర్మములందుఁ గానవచ్చునుగాని సనాతన ధర్మములందుఁ
గానరావు. అహింసా పరమోధర్మః-సత్యమేవ జయతి
నానృతం. ఇత్యాదులందు మార్పులు గలుగవు. జంతు
శాస్త్రమును జదివినవాఁడు రసాయన శాస్త్రముఁ బట్టి
యేర్పడిన యాధారములు నిష్కారణములనినయెడ నా
శాస్త్రము నెఱింగిన వారు నవ్వరా? శాస్త్రములు చ
దువరైరి. వానియందు విశ్వాస బుద్ధి లేదాయె. పె
ద్దల నడుగరైరి. వారియందు గౌరవము లేదాయె. స్వ
యముగ నాలోచించు శక్తియు లేదాయె. ఇఁక నేదైన
నెట్లు తెలియును? ఛందోలంకార వ్యాకరణాదుల చం

ద మెఱుంగక రచియింపఁబడు కృతులవలె శాస్త్రజ్ఞాన హీనుల యాచారములు ఘోరములై యున్నవి.

గో హింసయు మద్యపానము నస్పృశ్యతకుఁ గారణములని యొకరనిరి, కాని యది కేవలము సత్యము కాదు.

### అస్పృశ్యత కప్రేమ కారణమా?

మఱియొకరు ప్రేమ విషయమై మన గ్రంథముల లేనట్లు బైబిలు నుండి కొన్ని వాక్యములు చదివి పంచములు మనుష్యులు మనము మనుష్యులము. ప్రేమ మనుష్య ధర్మము కావున వారిని ప్రేమింపకుండుట ధర్మము గాదని యుపన్యసించిరి. ఈ విషయమున వారితో నేను బూర్ణముగ నేకీభవించెదను. ప్రేమ కేవల మనుష్య ధర్మము మాత్రమే కాదు. ప్రేమ స్వరూపమే లక్ష్మి. భగవంతుని కామె యనపాయిని. అట్లు మన గ్రంథముల నున్నది. ఈ విషయమై శ్రీ కృష్ణావతార తత్త్వమున విపులముగ విమర్శించితిని. కనుఁడు. ఈ ప్రేమ యనునది పంచముల యందు మాత్రమే వినియోగమా? లేక క్రైస్తవులందుఁ దురకల యందుఁ గూడ నుపయోగింప వలయునా? ఇప్పుడు మన ప్రభువులు మనుష్యులే కదా? ఏల వారిపై ద్వేషము? ఈ ప్రేమ మనుష్యులయందు మాత్రమే యుపయోగింప వలయును గాని పశుపక్ష్యాదులం దుపయోగింప రాదా? ఈ ప్రేమవాది గుఱ్ఱమును గాని, యెద్దులను గుఱ్ఱములను



గట్టిన శకటముల గాని యెక్కఁడా? ఎట్టి వారిని దూషింపఁడా? కోపింపఁడా? బైబిలు చదివి దానిని దలపై ధరించి ప్రేమ స్వరూప మెఱిఁగిన వారియందు జీవహింసయు మాంస భక్షణము చేయువారు లేరా? చేయని వారు లేరు గాక. ఇటీవల గొందరు మనలఁ జూచి శాక భక్షకులైరి. వారు హింస లకృత్యములని తెలిసి చేయుచున్నారా? తెలియక చేయుచున్నారా? ప్రేమ కార్యము ద్వేషము కోపము నని యెరుఁగురా? తల్లి దండ్రులు గురువులు పుత్రులను శిష్యులను దండించుట ద్వేషము చేతనా ప్రేమ చేతనా? ఈ ప్రశ్నము లప్రస్తుతము లని తలఁపకుఁడు.

### ఆత్మ బుద్ధి సుఖంచైవ.

ఆత్మ బుద్ధి సుఖంచైవ యనువాక్యము నొకఁ డుదాహరించి మన యిష్ట ప్రకారము మనకు మేలని మనస్సునకుఁ దోఁచినట్లు పోవలయును గాని యెన్నఁడో శాస్త్రముల వ్రాసిన వారల యభిప్రాయములఁ బట్టి మనము నేఁటికిని నడువవలయునా? యనిరి. మేలు మేలు. ఈ వాక్యము నీ యర్థమున జారులు చోరులు సురాపాయులు లోనగు దురాచారు లెల్ల ననువదింప వచ్చును గదా. ఈ వాక్యమున కిదియా యర్థము?

ఎట్టి బుద్ధి సుఖము నిచ్చును? శాస్త్రముల చేతను, బెద్దల చేతను శిక్షితమై పక్వమైన బుద్ధియా? ఏది

యు లేని యశిక్షితము నపక్వమునై యవివేక యుక్తమైన బుద్ధియా? ఈ విషయమున నొక చిన్న కథ స్ఫురణమునకు వచ్చుచున్నది. ఒక పెద్ద మనుష్యుఁ డొక గుఱ్ఱపు బండిలోఁ గూర్చుండి పోవుచుండెను. ఆ గుఱ్ఱమును బండితోలు వాఁడూరక కొట్టుచుండెను. ఆ పెద్దమనుష్యునకు జాలి పుట్టి పాపాత్ముఁడా యేలరా యానోరు లేని జంతువును జంపెద వని యడిగెను. ఆ ధూర్తుఁడు నా గుఱ్ఱము నా యిష్టము వచ్చినట్లు లుపయోగ పఱతును నీకేమి యని ధిక్కరించి పలికెను. పెద్దమనుష్యుఁడు బండిదిగి వాని క్రిందికి లాగి చేతిబెత్తముతో నూరక బాఁదెను. ఆ బండివాడు నన్నేటికయ్యా యూరకకొట్టెదవని యడిగెను. నా బెత్తము, నా యిష్టమువచ్చినట్లు నా బెత్తము నుపయోగింతును. నీకేమియని పెద్దమనుష్యుఁడు ప్రత్యుత్తరమిచ్చెనఁట. తన యింటికిఁ దానెట్లు చిచ్చుపెట్టరాదో యట్లేతనకు నితరులకుఁగీడగునట్లు తనబుద్ధి నుపయోగింపరాదు. ఈ శ్లోకమున నీ వాక్యమునకు వెనుకటివాక్యము వీరికిఁ బ్రమాణముకాదు కాఁబోలు. గురుబుద్ధిర్విశేషత యని కలదు కదా. వీరు తమతల్లిదండ్రులను గురువులను నీ విషయమై యడిగిరా? వీరి యభిప్రాయమును వా రంగీకరించిరా?

స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ యని కలదు గదా. ఈ యుపన్యాసకులు తల్లిగాని భార్యగాని భోజనమునకుఁ బిలి



చిన స్త్రీలబుద్ధి వినినఁ జెడుదుమనిపోక యుందురా? ఒకఁడు నిషేక ముహూర్తమునాఁడు పడుకటింటిలో భార్యను జూచి భార్యా రూపవతీ శత్రువని స్మరించి దాని ముక్కు చెవులు కోసెనఁట. ఇట్టి యపార్థములు చేసిన ననర్థకములుగాక మేలెట్లు కలుగును?

## అస్పృశ్యత సదాచారమగునా?

శాస్త్రమునందున్నను నాచారమందు లేనివికొన్ని కలవు. ఇది యట్టిదగునా చూతము. ఆచార ప్రభవో ధర్మ యని యుండుటచే ధర్మమున కాచారము మూలమని స్పష్టపడియె. ఆచారమనఁగా నెట్టిది?

శ్లో॥ పంచేంద్రియస్య దేహస్య, బుద్ధేశ్చమనస స్తథా
ద్రవ్య దేశ క్రియాణాంచ, శుద్ధి రాచార ఇష్యతే.

శాండిల్య ధర్మశాస్త్రము.

పంచేంద్రియములు — దేహము — బుద్ధి — మనస్సు - ద్రవ్య — దేశ — క్రియలు వీనిశుద్ధి యాచార మనబడును.

కన్నులు మోడ్చిరి! మూలనిఁ గనుఁగొన్న యుత్తమద్విజులకిరియుఁ (శ్రౌం, నై), ఉత్తమద్విజులనుటచే నాచారమందుఁ బంచములుగనో యంతకు నీచులుగనోయుండి కర్మచండాలు రయినవారు జాతిచండాలురఁ దాఁక వ

ష్ట్యునని తెలుపుచున్నది. ఏలన, జాతిచండాల యాత్ర్మ యన్నట్లు జాతి చండాలునకన్నఁ గర్మచండాలుఁడే నీచతరుఁడు. నేలఁ బడుకొనినవానికిఁ బతన భయము గలదా?

అంటితి నమస్నిహాయ పాపాత్మురాలి. (జై. భా.)
అపూర్వ కర్మచండాల మయిముగ్ధే విముంచమాం
(ఉ. రామ చరిత్ర)

అనియుండుటయు నాది శంకరాచార్యులవారు కాశిలో మాలవానిని దూరముగఁ బొమ్మనుటయుఁ ద్రిశంకుడు గురుపుత్ర శాపముచే మాలవాఁడు కాఁగానే ప్రజలందఱాయనను నగరము నుండి వెడలఁ దోలుటయు మీ రెఱింగిన విషయమే. వీని వలన నస్పృశ్యతా దోషము చిరకాలముగఁ బాటింపఁ బడుచున్న దనియు శిష్టులు దానిని దోషముగ నెంచి వర్తించుచున్నారనియు నేర్పడుచున్నది. ఇది నేఁటికి నాచార మందుండుట మీ రందఱెఱింగిన విషయమే. మహాత్ముఁడును దాని విషయమును జాతీయ మహాసభలోఁ బ్రస్తావనమునకు దెచ్చిన పిమ్మట సనేకు లా సభనుండి వీడి పోయిరని వ్రాసినట్లు ౫—౬ దినములకు ముందటి హిందూ పత్రికయందుఁ బ్రకటింపఁ బడియుండఁ గంటిని. దీని వలన చండాల స్పర్శము శాస్త్రము చేతను నాచారము చేతను దుష్టమని యేర్పడియె.



సందిగ్ధాచారములఁ బ్రమాణ మేది?

మనము సదాచారముగ గ్రహించిన దానిని వింధ్యోత్తర దేశము వారు దురాచారముగ భావించుట లేదా? వారంగీకరించినది మనము నిరాకరించుట లేదా? యందురేమో. సత్యము. అయినను "యస్మిన్ దేశే యదాచారః తస్మిన్ దేశే తథాక్రియః" ఏదేశ మేదేది యాచారమో యాదేశమం దదియే క్రమమైన పద్ధతి యని ప్రమాణము. అయినను బ్రస్తుత విషయమున నట్టి శంక కెడము లేదు. ఔత్తరాహికులు దాక్షిణాత్యులు నందరును జండాల స్పర్శ దుష్టమనియే చెప్పుచున్నారు గదా. కొందఱటు కొందఱిటు చెప్పినపు డెవ్వరి వాక్యము గ్రాహ్యమని శంకింతురేమో.

యది తే కర్మ విచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్। యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః। యుక్తా ఆయుక్తాః అలూక్షా ధర్మ కామాస్స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు యే తత్ర బ్రాహ్మణా సమ్మర్శినః। యుక్తా అయుక్తా అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తేషు వర్తేరన్। తథా తేషు వర్తేథాః। ఏష ఆదేశః। ఏష ఉపదేశః॥ ఏషా వేదోపనిషత్. ఏత దనుశాసనమ్ ఏవ ముపాసితవ్యమ్। ఏవము చైదదు పాస్యమ్॥ తైత్తిరోపనిషత్తు.

ఈ మంత్రముల కిట్లర్థము వ్రాయబడి యున్నది.

ఈ పరిహారము చేయుచున్న నీవు ఒకానొకప్పుడు శ్రౌత స్మార్త కర్మము లందుగాని యాచారము నందుగాని సంశయము కలిగిన యెడల ఆయా కర్మములను యథావిధిగా నాచరించుచున్నట్టియు సూక్ష్మదర్శులును, ఒకరి బోధ లేకయే తామే స్వయముగ కర్మములను నాచరించుచున్న వారలును ధర్మాసక్తులును, (ధర్మాసక్తులనగా నతీంద్రియమైన ధర్మ ఫలమును మాత్రమే అపేక్షించిన వారలు. కామాసక్తులయి లాభమును సన్మానమును అపేక్షించు వారలు మాత్రము కారని భావము) అగు బ్రాహ్మణులు ఆకర్మములను ఏ విధముగా నాచరించెదరో వారి యాచారము నవలంబించెదరో నీవు నట్లే యాచరింపుము. అని యుండుటచే మన ఈ మన దేశ మందలి శిష్టాచార మనుసరణీయము.

చండాల పర్యాయ నామములు.

శ్లో॥ చండాల, ప్లవ, మాతంగ, దివాకీర్తి, జనంగమాః॥
నిషాద, శ్వపచాంతేవాసీ, చండాలచపుల్కసాః॥

అని యమరుడు నామలింగానుశాసనంబున జండాల పర్యాయ శబ్దంబుల వచించెను. వానికి వ్యుత్పత్తులు లింగాభట్టీయ వ్యాఖ్యయం దిట్లు వ్రాయబడి యున్నది.

౧. చండతే కుప్యతీతి చండాలః. చడికోపే—కోపిం



చుకొనువాఁడు.

౨. ప్లవతే ఉగ్రకర్మణా ఇతిప్లవః. ప్లుఙ్గతౌ. క్రూర కర్మముకొఱకుఁ బోవువాఁడు.

౩. మా తంగతి నగచ్ఛతి గ్రామ మధ్య మితి మాతంగః. తగిగతౌ—గ్రామ మధ్యమును బొందనివాఁడు

౪. దివసస్య పుణ్యకాలత్వాత్ దివా అకీర్తనమస్యేతి దివాకీర్తిః కృతసంశబ్దే—పగలు పుణ్యకాలము గనుక అనుచ్చారణ లేనివాఁడు.

౫. జనాద్గచ్ఛతీతి జనంగామః గమ్ౢగతౌ—జనుల నుండి తొలఁగిపోవువాఁడు.

౬. నిషీదతి పాపం అస్మిన్నితి నిషాదః షద్ౢ విశరణ గత్యవసాదనేషు వీనియందుఁ బాపముండును.

౭ శ్వానం పచతీతి శ్వపచః డుపచ్ష్ పాకే కుక్కను వండుకొనువాఁడు.

౮. అంతేగ్రామాంతే వసతీతి అంతేవాసీన. పు. వస నివాసే. గ్రామము కడపటనుండువాఁడు.

౯. చండాల ఏవచాండాలః చండాలుఁడే చాండాలుఁడు.

౧౦ పులంతీతి పులాః మహాంతః తావ్ స్పర్శనేన కస్తే శాతయతీతి పుల్కసః పులమహత్త్వే. కసగతి శాతనయోః పెద్దలను స్పర్శచేతఁ జెఱుచువాఁడు.

ఈ వ్యుత్పత్త్యర్థములను బరిశీలించినచో వారిస్థితి

గతులను, వానికిఁగల హేతువులును బోధపడును. ఈ నామములు స్మృత్యర్థములను శిష్టాచారమునుగూడ స్థాపించుచున్నవి.

### పంచముల ప్రస్తుత స్థితికి నేమి కారణము?

౧. ఆర్యులీ దేశమునకు వచ్చుటకుఁ బూర్వము నుండియుఁ బంచములీ దేశమున నుండిన వారనియు, వారిని నార్యులు జయించి యణఁగఁ ద్రొక్కియా విరోధముతో నిట్టి యధమస్థితియందుంచి ద్వేష బుద్ధిచే నస్పృశ్యులనిరని కొందఱందురు. ఇది సరియని తోఁపదు. ఆర్యులీ దేశమందలి వారే కాని యెక్కడనుండియో యాకాశమునుండి యీ దేశమున కవతరించినవారు కారు. ఇందుండియే నానా దిక్కులకు దేశములకుఁ బోయిరి. అనాదులని యేనాదులను[అనాది—ఏనాది] చెంచులను నిట్టివారిని జెప్పినఁ జెప్పనగును గాని యెల్లచండాలురఁ జెప్పరాదు—అనేకులు చండాలురు భ్రష్టులైన యార్యులు. ఈ విషయము మున్ముందు కొంత తెలుపఁబడును.

### బ్రాహ్మణులు కారణ భూతులా?

రెండవ కారణము— బ్రాహ్మణు లసూయా ద్వేషములచే వారి నణఁగఁ ద్రొక్కి యస్పృశ్యులను జేసిరఁట. వక్కాను జూచిన వారందఱు వేటకాండ్రే).



అన్ని యనిష్టముల కంగారకుఁడు పాత్రుడన్నట్టు తథ్య మిథ్యా కల్పిత దోషముల కెల్ల బ్రాహ్మణుఁడు కారణము. తమకంటె నున్నత స్థితి యందుండు వారిని జూచిన నసూయ జనించును. తక్కిన నాలుగు వర్ణముల వారికంటె వారున్నత స్థితియందున్నారు. కావున దమకంటె హీనుల యెడ నసూయకుఁ గారణము లేదు. లోక విరోధ కారణములు స్త్రీ ధన వృత్తి మతములై యున్నవి. ఈ విషయములందు వారికి వీరికి వివాదము లేదు. కావున ద్వేషము లేదు.

జయించి లోపఱచుకొనుట కాని తదితరము కాని ద్వేష కారణ మయ్యెనేని వీరివంటి వారే యగు చెంచులు—బోయలు ఎఱుకలు—ఏనాదులు మొదలగు వారినేల యస్పృశ్యులని తక్కిన వారు చెప్పరైరి.

“భేదాః కిరాత శబర పుళింద మ్లేచ్ఛ జాతయః” యని యమరుఁడు కిరాతులు—శబరులు—పుళిందులులోనగు మ్లేచ్ఛ జాతులును జండాలు రందు భేదముగాఁ జెప్పెను. గోమాంస భక్షకో యస్తు, లోక బాహ్యంచ భాషతే సర్వాచార విహీనో ఽ సౌ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే” యన్నటు లీమ్లేచ్ఛులును జండాలురే కదా. వారు స్పృశ్యులెట్లయిరి? మ్లేచ్ఛులు గ్రామ చండాలురు. పంచములు బహిశ్చండాలురు. వెలివాడ యందుండు వారు. అడవులందో నగరములందో కొంతకాలమైన ప్ర

భువులుగా నుండిన తురుష్కులు ద్వేష్యులయినం గావచ్చును. గాని యేనాఁడును నాదిమకాలమందుఁ గూడ నట్టి దశయందు లేని పంచము లెట్లు బ్రాహ్మణులకు ద్వేష్యులు కాగలరు?

స్మశానమున శవాగ్నిని “చండాల గృహ దాసీయ” యని మంత్రములు చెప్పుదుము గదా. దీని వలన నేమి గ్రహింపవలయును? తగిన సమయముల వారికిని బ్రాహ్మణులు గౌరవము కలిగించిరనియే కదా.

## అస్పృశ్యులు పంచములు మాత్రమా?

అస్పృశ్యులని పంచములను మాత్రమే యనుచున్నారమా? కట్టుకొన్న భార్యను, గుల ముద్ధరించు కోడలిని, గడుపునఁ బుట్టిన పుత్రికను, గన్నతల్లిని నెలనెలకు మూఁడు నాలుగు దినము లస్పృశ్య లనుచున్నాము గదా. దీనికి నసూయా ద్వేషములే కారణమా? ఈ యాచారము బ్రాహ్మణ గృహములందు మాత్రమే కలదా! సాధారణముగా గృహములందు స్నానము చేసిన వారొక యింటనే యుండువారిని స్నానము చేయనివారిని నేల తాఁకరు? వారు పంచము లనియా? జపము చేయు నపుడును బవిత్ర సమయము లందును నేల తమ వెండ్రుకలు దాము తాఁకరాదని నాభికిఁ గ్రిందిభాగ మస్పృశ్యమని పెద్దలు చెప్పిరి? స్నానము చేసిన తరువాత మనము కట్టివిడిచిన వస్త్రమునే మైలయని యేల తాఁక



ము? మన దేహముల నుండి వచ్చిన మల మూత్రముల నేల యస్పృశ్యము లందుము. తమ స్థలములు విడిచిన తరువాత గోళ్ళను, దల వెంట్రుకలను, దంతములను నేల యస్పృశ్యము లనుచున్నాము—మనుష్యుల నఖదంత శిరోజము లస్పృశ్యము లపవిత్రములఁట. పులి గోళ్లు, నేనుఁగు దంతములు, చామరములు పవిత్రములఁట. ఇవి యెల్ల నిట్లగుటకు బ్రాహ్మణులే కారణభూతులా? పంచములను బ్రాహ్మణులు మాత్రమే తాఁకక యున్నారా? తక్కిన మూఁడు వర్ణముల వారును దాఁకుట లేదుకదా? పంచములనఁబడు మాలలు మాదిగలు కలసి మెలసి యొక్కటిగ నున్నారా? మాదిగ లెట్లు మాలల కస్పృశ్యులయిరి? వర్ణాశ్రమాచార హీనులైన క్రైస్తవులు మాలలను మాత్రమే తమలోఁ గలుపుకొనెదరే మాదిగల నేల కలుపుకొనరు? అస్పృశ్యులనఁబడు వైకోము సత్యాగ్రహులకు నస్పృశ్యులైనవారు కొందఱు కలరని హిందూ పత్రికయందుఁ బ్రకటింపఁబడియుండెఁగదా. అస్పృశ్యులగువారు ఫ్రాన్సు—ఇంగ్లాండు—అమెరికా దేశము లందు లేరా? ప్రత్యేక జాతిగ లేకున్నను ననుభవమందు లేదా? ముట్టుతలు సమీపించినను దాఁకినను గొన్ని పూలచెట్లు జంతువులు నశించునని శాస్త్రజ్ఞులు ననుభవజ్ఞులు చెప్పుట లేదా? ఇవి యేకదా దేవతా వృక్షములని దేవతా మృగములని చెప్పఁబడుచున్నవి. ఈ కారణము చేతఁ బంచము లస్పృశ్యు లగుటకు నసూయా ద్వేషములు కారణములుగావు

బ్రాహ్మణులును గారు—ఇవన్నియు న్యాలోచించిన నస్పృశ్యతకుఁ గారణాంతరము కలదని వివేకులకుఁ దోఁపక మానదు.

౩. గోవధము, మాంస భక్షణము కారణములనుటయు సరిగాదు. అట్లుచేయువారు గ్రామములందే యున్నారుకదా? క్షత్రియులు, శూద్రులు, మాంసభక్షకులు గారా? రంతిదేవుఁడు గోసవము చేయలేదా? శుక్రాచార్యులు సురాపాయికాఁడా? అగస్త్యుఁడు మనుష్యుని భక్షింపలేదా?

### అణఁగ ద్రొక్కుట.

పంచములను దక్కిన వర్ణములవారు తాకకున్నంతనే వారిని వారణఁగ ద్రొక్కినారఁట. పంచములు చేయునది ఘోరకార్యము అన్నదోషములకుఁ దల్లియై యన్ని యనర్థములకుఁ బావల్యమైనది. జీవహింస వారికి హింసయుఁ, బశువులఁ గోయుటయు, మాంసము నెత్తురు, శల్యములు, పూతిగంధము వీనిలో మునిఁగి తేలుటయే కార్యములయి యున్నవి. వృత్తిననుసరించియే చిత్తవృత్తియు నుండును. క్రూర కర్మములు చేయు వారి మనసు క్రూరముగనే యుండును. కావునఁ గ్రూర కర్మముల చేయుచు నపవిత్ర పదార్థములతోఁడ సాంగత్యము గలవారికి దేహము మనస్సుకూడ నపవిత్రముయి యుండును.



కం॥ మాంసము సమలెడి దుష్టనృశంసులు కానంగ
లేరు సత్యము తగన్షర్ణ॥

అనిసీతాదేవి చెప్పలేదా?

కాఁబట్టి వారు గ్రామమధ్యమున నుండఁ దగుదురా? వీరుచేయు కార్యములు వీరు మానుకొన్న మతియొకరయిన జేయవలసినవే కాని మానవలసినవి కావు కదా? వేశ్యలు వారు వృత్తి మానినను బరకీయులు వారివృత్తి యందున్నారు కదా. చెన్నపురి యందుఁ బంచములు దొడ్ల నూడ్చుట మానినపు డేసాములను దెచ్చి పెట్టిరి కదా. వారు మానిన మరియొక రాపనికి బూనుకొన వలసి యుండును గదా. కావున నిప్పటి పంచములు వారివృత్తి మానిరేని తక్కిన వర్ణముల లోనివారా కార్యములు జరుప వలసి యుండును. అప్పుడు వారును వీరివలె నస్పృశ్యులే యగుదురు. అస్పృశ్యత యనునది యపవిత్రత బట్టి వచ్చినది కాని యితరము కాదు.

### అపవిత్రులస్పృశ్యులు అపవిత్రములస్పృశ్యములు.

మన యిరుగు పొరుగువారు బ్రాహ్మణ నామధారు లయినను చండాల వృత్తియందుండి వారికి దేహములు మనస్సులు నపవిత్రములయి యుండిన వారిని సమీపింతుమా? కటికి యింగళ్ళు హింసాలయములు (Slaughter Houses) పురబాహ్య ప్రదేశములందో

ప్రత్యేక స్థలములందో యుంచుట కేమి హేతువు? బహిష్ఠ స్త్రీల దూరమున నుంపనేల? కల్లుంగళ్ళు పుర మధ్యమున నుంపరాదనుట కేమి కతము? ఔరంగ జేబు తమ దేహముల విక్రయించి జీవించు వేశ్యలను గుడిసెవాటులను బురము వెలుపలఁ బ్రత్యేక స్థలము నందుంచి దానికి సైతాను పురమని పేరుపెట్టియుండె ననుట మీరును జదివియే యుందురు. దేశ ప్రజా యోగక్షేమముల విచారించు స్వదేశాభిమానముగల ప్రభువు లుండురేని వెలివాడలో నుండదగిన వారు మనలో నెందఱో యిప్పుడు గలరు. కావున వెలిగా నుంచుటకుఁ గారణము మీఁద నుదాహరించిన యాచార లక్షణమునకు వెలిగా వారు వర్తించుటే కాని యితరము కాదు. బ్రాహ్మణులు పుణ్య పాపములను, గార్యాకార్యములను, మంచి సెబ్బరలను దోషములకుఁ బ్రాయశ్చిత్తములను జెప్పిరిగాని ప్రభువులై యధికార బలంబునను భుజబలంబునను నెవ్వాని నణఁగ ద్రొక్కినవారు కారు. అణఁచెడి పని కాలుసేతులవి కాని శిరస్సుది కాదుకదా. అడుసు ద్రొక్కవలదు అని కాళ్ళకుఁ దల చెప్పును. త్రొక్కినా కడుగుకొనుము, అంత వఱకుఁ జేతులా ప్రదేశమును దాఁకరాదు, అని చెప్పును. ఈ హితమును బోధించుటచేఁ గాళ్ళపైఁ దలకు విరోధ మనవచ్చునా? సమస్త భూతములకు ముక్తి పరమావధిగా నిర్ణయించి దానిని సంపాదించు సాధనము లన్నియు ధర్మములనియుఁ దద్విరుద్ధము లన్నియు నధర్మము



లనియు మనవారు చెప్పిరికాని మన మిత్రులు ప్రేమ విషయమై చదివిన బైబిలు సందువలెఁ గొందఱు జీవులకు శాశ్వత నరకమే కాని మోక్షములేదని చెప్పరైరి. ఇట్టి మోక్షము మనుష్యులకు నెట్టి నికృష్టులకు మాత్రమే కాక పశుపక్ష్యాదులకును సాధ్యమని మనవారు చెప్పిరి. కాని పంచములకు మోక్షము నిరాకరింపఁ బడలేదు.

శ్లో॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య, యేపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రా, స్తేపియాంతి పరాం గతిమ్
అపిచేత్సుదురాచారో, భజతే మా మనవ్యభాక్
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితోహి సః
క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి॥

మ॥ యవనవ్యాళ పుళింద హూణశక కంకాభీర చం
డాల సం। భవులుం దక్కిన పాపవర్తనులు నేభద్రా
త్ము సేవించి భా। గవత శ్రేష్ఠులడాసి శుద్ధ తనులై
కల్యాణులై యుందు రా। యవికారుం బ్రభవిష్ణు
నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్॥

అని చండాలురకును ముక్తి గలదనియు, ముక్తికి నుపాయమును జెప్పియంతతో నిలువక స్వకులాభిమానము విడిచి

మ॥ అమలజ్ఞాన సుదాన ధర్మనీతి సత్యక్షాంతి నిర్మత్స
ర| త్వములన్ యజ్ఞతపో నసూయలఁ గడున్ దర్పిం
చు ధాత్రీ సురో| త్తము కంటెన్ శ్వపచుండుముఖ్యుఁ
డు మనోర్థప్రాణ వాక్కర్మముల్ సమతన్ విష్ణు
నయించెనేని నిజవంశ శ్రీకరుండౌఁ దుదిన్॥

దాన జ్ఞాన తపోయాగాదు లొనర్చి గర్వించు బ్రాహ్మణు కంటెఁ ద్రికరణ శుద్ధిగ భగవంతు ధ్యానించు భక్తుడే చండాలుఁడైనను శ్రేష్ఠుఁడనిరి. అంతతోఁ బోక దేవతాదర్శన సమయమునందుఁ జండాల స్పర్శ దోషావహము గాదని చెప్పుటేకాక యట్టిదిదోషమని శంకించినను బాపమువచ్చుననిరి. చండాలోస్తు సతుద్విజోస్తన మనీషా పంచకమునందు నాత్మజ్ఞానము గలవాఁడు చండాలుఁడయినను దనకు గురువేయని శంకరాచార్యులు చెప్పిరి. ఇఁక రామానుజీయులు, నశూద్రా విష్ణుభక్తాశ్చ, భక్తాభగవతా స్మృతా, యని శూద్రులను భాగవతులఁ జేయుచుఁ బంచములను శిష్యులుగా గ్రహించి వారికిఁ దత్త్వోపదేశముఁ జేసి వారియందుఁ గొందఱ దాసరులఁజేసి వారిని పంచములకెల్ల భక్తిమార్గము పదేశింప నియమించిరి. వారు శూద్రుని గురువుగా గ్రహించిరి. విశేషభక్తి గలవారని తోఁచిన చోటులఁ బంచములు దేవాలయమందుఁ బ్రవేశింప ననుజ్ఞ యిచ్చిరి. మేలు కోట కదిరి లోనగు స్థలంబుల నిది గననగు. మఱియు నొక పంచముని నాళ్వారుఁగ జేసిరి. వే



షాల మాఱిగాక నిజమైన పరభక్తి గలవానియందు జాత్యాచారముల నెన్నఁ బనిలేదు.

రామానుజాచార్యులు తాను నరకము పాలయిన నగుదును గాక యని యా పంచములు వినఁ దిరుమంత్రము ఘోషించె. శూద్రుఁడయిన గురువు నుచ్ఛిష్టము భుజింప యత్నించె. ఇటులే ద్వైత మతము వారయందును బ్రాహ్మణులకంటె నెక్కువగ గౌరవింపఁబడు భక్తులు గలరు. భక్తిని ప్రధానముగఁ జూచిరి గాని కబీరు తురకయని నిరసింపరయిరి. దేహాత్మలయందునాత్మయే నిత్యము శాశ్వతము శ్రేష్ఠమని యెఱింగి దానియందేలోప మెవ్వరికి లేకుండఁ బూర్వు లొనర్చిరి. కాని యిప్పటి వారివలె రెంటను బ్రయోజనము లేని స్పర్శముచేఁ గన్నీళ్ళు దుడుచు యత్నము చేసినవారు కారు. సాధకుఁడు జీవుడు. సాధనము దేహము. సాధనము నిర్మలముగ నుండినఁగదా సాధకునకు మేలు. ఆత్మబోధ చేసిన వారు దేహ పారిశుద్ధ్య విషయమైన బోధ యేల చేయరైరందురేమో జ్ఞానికి భక్తునికి దేహము తృణప్రాయము. కృత కృత్యా నిరీక్షంతే, మృత్యుం ప్రియమివాతిథిమ్మని వారికి మరణ భీతిలేదు. దేహమే నాఁడైన నశించునదే. అది మల భాండము. పైశుద్ధి మాత్రమున్న నేమి ఫలము? స్నానముచాలించుటచే కదా ౨—3 స్నానములు విధింపఁ బడినవి. ఇది బ్రాహ్మణుల కన్వయింపదా? వారేల దేహ పరిశుద్ధికయి

పాటుపడెద రందురా? అది వృత్తి వృత్తముల వలననైన
ది. పంచములు వారి వృత్తి యందుండక విధిలేదు.
అది కులధర్మము. దోషయుక్తమైనను గుల ధర్మము
విడువ రాదు. పంచమ వృత్తియందుఁ బారిశుద్ధ్యము
కాపాడుకొనుట దుష్కరము. భూమి దున్ని విత్తి నీ
ళ్ళలోఁ బురదలోఁ బేడలో సదా తిరుగుచుండు కాఁ
పులుఁ బురములయందుఁ జలువ గుడ్డల ధరించి వన్నె
విసన కఱ్ఱల వలెఁ దిరుగు కాఁపులవలె నుండ సాధ్య
మా? నాగరికులయిన కాఁపులు మరల నెరువు తట్టల
మోయఁ బోవుదురా? వృత్తి సాంకర్యము ప్రబలుట
చేఁ గదా మన మిట్టు లయితిమి? కావునఁ బూ
ర్వులు వృత్తి సాంకర్యము దాని మూలమున వృత్తి
సాంకర్యము వర్ణ సాంకర్యము గలిగింప యోజింపక ఇ
హము నందుఁ బరమునందుఁగూడఁ దరించు విధమేర్పా
టు చేసిరి. ఈ కాలమున నది విపరీతముగఁ గానవ
చ్చుచున్నది. దాని కజ్ఞానము విపరీత జ్ఞానము భక్తి
శూన్యత కారణములు.

అట్లైన వారికి విద్యయు నారోగ్య పద్ధతులు నే
ర్పుటకూడ నీకిష్టము లేదా యందురేమో, దేహసేవ
దేశసేవ—దేవసేవ యుత్తరోత్తర శ్రేయముగఁ జేయ
వారికి విద్యనేర్పి తెలివి తేటలు గలిగించుట నాకు బర
మ సమ్మతము. నేను గోరున దదియే కాని యితర
ము కాదు. వారి కులధర్మమున కనుసరించిన కులవిద్య



నేర్పి వృద్ధికిఁ దెచ్చిన మేలు కలుగును గాని మానముపోయి
వారిని దాఁకిన నేమి మేలు గలదు?

### అధమస్థితి హేతువు

ఇఁక వారధమస్థితి యందుండుటకుఁ గారణమును
విన్నవించెదను.

ఆత్మలన్నియు సమానములు గావున నుత్తమాధ
మస్థితి వాని విషయమునఁ జెప్పరాదు. ఉత్తముఁ డధ
ముఁడను భేదము దేహగతము. దేహములకుఁ బ్రపంచ
ధర్మమున లౌకిక వ్యవహారంబుల నుత్తమోత్తమోత్తమ
త్వములు ధనలాభము కొలఁది నుండును. అధమాధమా
ధమత్వము ధనాలాభము కొలఁదినుండును. ధనము కల
వాఁడే సర్వము కలవాఁడు. ఇట్టిధనము పంచములందు
లేదు కావున గౌరవము లేదు. కలిమి కులాల మిండఁ
డనఁగా వినమా? పూజింపఁ బడునది దశగాని దేహము
కాదు. అవస్థా పూజ్యతే రామ, యని భరద్వాజులు
రామునకుఁ జెప్పలేదా? ప్రజల కప్రియకరుఁడైన తహ
శీల్దారుఁ డుపవేతనము పొందఁగానే ప్రజలెట్టు లతని
జూచుచున్నారో యెఱుఁగమా? పంచములకు వారి
వృత్తి పోవుటయే వారిదారిద్ర్యమునకుఁ గారణము. వారి
యొద్ద ధనముండెనా వారి యిండ్లకుఁబోయితాఁకి దొంగ
దండములు పెట్టి డబ్బుసేకరించి ప్రాయశ్చిత్త మొనర్చి
తిమని తక్కిన జాతులవారు చెప్పుచు నుందురు.

వారి వృత్తి వారికున్నదిగా? ఎక్కడికిఁ బోయిరి నదందురేమో. వారివృత్తి వారికి లేదు. ప్రభువులును, పాశ్చాత్య వేషాభిమానులును, దదను కారులును వార జీవనము హరించి వారినోర మట్టికొట్టిరి. పూర్వపుస్థితి హరిశ్చంద్రునిఁ కొనిన మాలవాఁడే తెలుపుచున్నాఁడు ఒక్కఁడైన నట్టివాఁడిప్పుడు గలఁడా?

పూర్వమునఁ జావనున్న పశువులు చచ్చిన పశువులు పంచములవియే. వానికి వేఱుగతి లేకుండుటచేఁ గొంచెము వెలలకె పంచములు విక్రయించుకొని వాని తోళ్ళతోఁ జెప్పులు, మచ్చెలు, బొక్కెనలు జీనులు మొదలయినవియుఁ గొమ్ములతో దువ్వెనలు లోనయినవి చేసి విక్రయించియు స్మశానములఁ గావలియుండి యుండువచ్చు రూకల గడించియు, యథాసుఖము జీవించుచుండిరి. స్మశానరక్షణము వారికి విధియగుటచే నిప్పటి Residential Surgeons, Military Residents మొదలయిన వారివలె స్మశాన సమీపమందే వారు కాఁపురముండిరి. వారివృత్తియు గ్రామబాహ్య ప్రదేశమున కనుకూలమైన దయియుండెను. వారు గ్రామాంతమున నుంపుటకిదే కారణము యుండ వలయును ఆర్యుల స్మశానము లెప్పుడును గ్రామ మధ్యమున నుండవు గదా.

పంచముల కట్టులభించుచున్న చర్మములో యిప్పుడు పరదేశములకుఁ బోవుచున్నవి. కొన్నిప్పు నేటిమై



పోవుచున్నది. పరదేశమునకుఁ బోయిన చర్మములు బూట్సు, హాట్సు, హార్నెస్ స్లిప్పర్సు, కిట్ బాగ్సు, లోనైనవిగా మారి నానా విధ నామముల వహించి యొకటికి నేఁబది యంతలు విలువగలవై మరల జన్మ భూమికి వచ్చి మనవారిచే బహూకరింపఁబడి పాణిగ్రహణము కావించుకొనఁబడుచున్నవి. శిరసా వహింపబడు చున్నవి. ఇప్పటి మన నాగరికులకుఁ బరదేశముల నుండి వచ్చిన బూట్సు లోనైనవి తమ యందగ నకు సరిపడునని తలంపు గలదు. ఈ పంచములు కుట్టిన చెప్పులు మొదలైనవి సరిపడవని తలఁచి యీసడింతురు. ఈ కారణమున వారికి బ్రదుకుదలను వీరు హరించిన వారైరి. వి సరమేలకాని పరదేశ వస్త్ర బహిష్కారము వలెనే పరదేశము నుండి వచ్చిన చర్మకృత పదార్థములును బహిష్కారము కావలెను. అప్పుడు మన పంచము లెంతో శీఘ్రకాలమున నభివృద్ధికి వత్తురో కనుఁడు—తోళ్ళకొమ్ముల యెగుమతి నిలుపుదల కావలయును. ఇది ప్రజలు చేయదగిన కార్యమే. ఆ వస్తువులు నాణెముగా సిద్ధము చేయు విధముల నేర్పుపాఠశాలల నేర్పఱుప వలయును. ఇప్పుడు కొందఱు వస్త్రములు నేసి జీవించుచున్నారు. కావున నా విద్యయు నేర్పవచ్చును. కొమ్ములతో దువ్వెనలు, గుండీలు, లోనగు వస్తువులు చేయు నేర్పవలయును. ఇట్టి విద్యల నేర్పినఁ గూటికి మార్గ మేర్పడును. కూటి కుండినఁ గోటియున్నట్లు ధనము చేకూరలేది యొక సౌఖ్యము వెంట వేఱొకటి తనంతట

దానే వచ్చును. ఈ విధముగ వారిని వృద్ధికిఁ జేనల
యు గాని మిమ్ము మేము ముట్టు కొందుము కట్టు
కొందుము కౌగిలింతుము నేలఁబడి పొర్లాడుదు మనఁగానే
వారికి వచ్చిన లాభమేమి? నిజముగ నేమి మేలుచేసినట్లు?
మీరు మమ్ముఁ గౌఁగిలింపఁగానే మా కడుపు చిచ్చు చ
ల్లారునా? మంచి వస్త్రములు వచ్చునా? యని వారడి
గిన వీరేమి ప్రత్యుత్తరము చెప్పుదురు?

వారిని దూరముగ నుంచుఁడని వారి వేషములే
చెప్పుచున్నవి. మీరొక సభకుఁ బోవునపుడు సభ్యవే
షముతోఁ బోయిన గౌరవము గలదా అసభ్య వేష
మునఁ గలదా? ఎందైనను గౌరవ పోషకము వేష
మే. నన్ను మీరు చూడకముందు నేనీ బైరాగి వేష
మున మీ కడకు వచ్చి యుండిన మీరు నన్నేమని యుం
దురు? పంచములు క్రైస్తవులుగా మారినపుడు క్రై
స్తవ మత బోధకులు వారిని మంచి చలువ వస్త్రము
ల యుడుపులు ధరింపఁ జేసి వెలుపల నంపుచుందురు. కం
టి కసహ్యముగ నుండని కారణముచే సమీపింప నిత్తు
ము. ఆ క్రైస్తవులే బికారి వేషముల వేసిన దగ్గఱకు
రానిత్తురా? కావున వారు సమీపింప సహింపఁ జేసినది
వారి శుభ్ర వేషము గాని వారి మతము గాదు.
Short Storiesఅను గ్రంథము నందొక కథ చదివి
యుంటిని. ఒక పండితుఁడు దరిద్రుఁడు కావునఁ జింపి
యుడుపులు ధరించి దూతగా నొక పెద్ద మనుష్యునొద



కుఁ బోయెను. ఆ పెద్ద మనుష్యుఁడు కూర్చుండుమని
యైనఁ జెప్పక సిలువఁ బెట్టి వచ్చిన కార్యము విచారించి
ప్రత్యుత్తరము వ్రాసి యిచ్చి వీథివఱకు వచ్చి సగౌరవ
ముగ సాగనంపెను. ఆపండితుఁ డాశ్చర్యపడి "య
య్యా, నేను నీయొద్దకు వచ్చినపుడు నీవు నన్నుఁ గూ
ర్చుండుమనియైనఁ జెప్పక నిరాదరించితివి. ఇప్పుడేల
యింతగా సన్మానించి యింత దూరము వచ్చితివి" అని
యడిగెను. ఆ పెద్ద మనుష్యుఁడు "నీ వేషమునకుఁ దగి
నట్లు స్వాగత మిచ్చితిని. ఇప్పుడు నీయోగ్యతకుఁ దగిన
ట్లు సాగనంపుచున్నాను." అని చెప్పెను.

ఇంతేకాని వారు క్రైస్తవులగుటచే నాదరింతు
మనుట భ్రాంతి. ధూమశకట ఘట్టము లందలి పూఁట
కూళ్ళ శాలలలో (Restaurents) చలువ గుడ్డల యు
డుపుల ధరించి పంచములు కాఫీనీళ్ళు లోనైనవి తెచ్చి
యిచ్చిన మన బ్రాహ్మణ కేసరులే త్రాగుట లేదా?
వీరు వీధులూడ్చు నర్ధనగ్నుఁడు నేఁటిమాపు వస్త్రముల
వాఁడు తెచ్చియిచ్చినఁ ద్రాగుదురా? మంచి యుడుపులు
కావలయునన్నిన ధనము కావలయును. మంచి యాహా
రము కావలయునన్న ధనము కావలయును. జగత్తే ధన
మూలము. ధనమువచ్చు మార్గము నేర్పక మేఱమె
చ్చుల నెయ్యము నెఱపిన నేమి ప్రయోజనము? వారి
దుస్థితికిఁ బ్రభుత్వము వారును పాశ్చాత్య నాగరకతా
పిశాచిగ్రస్తులైన మనవారు కారణమని యున్నే చెప్పితిని.

గదా. ఏదీ మీయభిమాన మెంత మాత్రమో చూతము. శుష్క వాదములతోఁ బనిలేదు. వాస్తవముగ వారియందు నభిమానముండు వారందఱును బరదేశమునుండి వచ్చినవి కాని యీ దేశమం దయినను బంచములు తప్ప—బ్రాహ్మణులైనను సరియే—యితరులు చర్మములతోను గొమ్ములతోను జేసిన వస్తువులను మేమిఁక గ్రహింప మనియుఁ జర్మముల నితర దేశములకు బోనీయమనియు బాసచేయుఁడు. బాసచొప్పున వర్తింపుఁడు. ఇట్లు చేసితిరేని వారు కడుపునిండఁ గూడు తిందురు. దేహము నిండ గుడ్డలు గట్టికొందురు. వారి గుడిసెలే మేడలగును. అన్ని సౌకర్యము లబ్బును. ఈ విధముగ నధమ స్థితియందుండు వారి నుత్తమ స్థితికిఁ దేవలయునుగాని యుత్తము లధమస్థితికిఁ బోవుట మాత్రము ఫలము గాఁగల కార్యము చేయరాదు. చూచితిరా! ఆవేశ మెత్తినట్లు లింతసేపు మాటలాడిన వారిలో నొకరయిన నిలఁబడి మాట చెప్పిరేమో. ఇట్టి వాచాకైంకర్యముల తోను శుష్క హృదయములతోను బనియగునని తలఁచితిరా? లేక పరాయి బిడ్డలను బావిలోఁ ద్రోచి వేడుక చూడ నెంచితిరా? దూఁకు దూఁకు మనువారే కాని దూఁకువారు లేరు. మీరు నోట జెప్పినదానిని మీ యంతరాత్మ యంగీకరించినదా? అది నిర్దుష్టమని తోఁచినవాఁరు వారిని దమయిండ్లలోనికి రానిచ్చుచున్నారా?



ఒకరీ ధర్మసందేహము సృష్టి మొదటికిఁ బోయినఁగాని తీరదనియు నందఱము ఆడమ్ (ఆదిముఁడు) ఈవ్ (అవ్వ) సంతానము వారమే కావున నొక కుటుంబములోని వారమే సోదరులమే యనియు సోదరులొకరి నొకరు తాఁకరాదనుట ధర్మము కాదనియు నుపన్యసించిరి. ఈ సౌభ్రాత్ర మాత్మగతమా? దేహగతమా? కర్మాద్వైతం నకర్తవ్యం। భావాద్వైతం సదాకురు అన్నట్లైతె యద్వైతము కర్మమునందు నాచరింప వచ్చునా? అట్లయినచో నందఱము బ్రహ్మ ముఖమునుండి చేతులనుండి తొడలనుండి పాదములనుండి పుట్టిన వారమనుట భ్రాతలమే కదా. అయ్యలారా! సోదరులను సోదరులు వివాహమాడవచ్చునా? చెల్లెండ్ర యందు బిడ్డలఁ గనవచ్చునా? సోదరులు దాయభాగార్హులే కదా? మీ సొత్తు వారికిఁ గొంచెము పంచియిచ్చెదరా? అర్థకామ విషయములందు మాత్రము సౌభ్రాత్రము పాటింపరాదు గాఁబోలు!

మీరు పంచములఁ దాకి యుద్ధరించెద మనుచున్నారు గదా? తాఁకుట నిషేధముకాని యొకల నేనాదులఁ జెంచుల బోయలఁ దాకి యేమి యుద్ధరించుచున్నారు. వారధమ స్థితియందు లేరా? వారిని మంచి స్థితికిఁ దేరాదా? పంచములందు మాత్రమేమి యింత వాత్సల్యము? మన స్వప్రభువుల కాలమున నరణ్యము లన్నియు నీ శబరాదుల స్వాధీనములో నుండెను. వానికి వారే యధిపులయి రాజులకు వన్యఫలాదులఁ దెచ్చి

యచ్చుచు వచ్చినప్పుడు సేనలను దోచు పంపుచుండిరి. అడవిలోఁ బ్రయాణము చేయు బాటసారులను దొంగల నుండి యపాయములనుండి రక్షించుచుండిరి. ఏ ప్రదేశములో దొంగతనము జరుగునో దాని కా స్థలాధికారులైన నాయకులు ఉత్తరవాదులై నష్ట ధనమునైనఁ జోరులనైనఁ దెచ్చి రాజున కర్పింప వలసి యుండెను. అట్లు చేసి వారందరును హాయిగా జీవించుచుండిరి. ఇప్పుడో వారు కాయగసురులు కోసితినుటకుం బ్రాప్తి లేకుండట యటుండ నడవిలోనికిఁ దపస్సు చేసికొనఁ బోయినను గారాగృహ ప్రాప్తిలభించు. ఈ యడవి జాతుల వారందరు నిప్పుడు కూడులేక యల్లాడుచుండుట చూచుచున్నాము గదా. వీరిదయ యెండలి యంప సమముగ వర్తింప నేయుఁడు.

బావిలోఁ బడినవాని నుద్ధరింప వలయు ననినచ్చినయెడ దాళ్ళువేసి పైకిదీయవలయుఁగాని గడ్డమందు గాఁడును దూఁకిననేమి చేయఁగలఁడు.

తనుద్ధరించుకొని వానినుద్ధరింపఁ గలఁడేని యట్లు చేయవచ్చును. శ్రీరాముల పాదస్పర్శచే రాయి స్త్రీ యయ్యెను. శ్రీకృష్ణుని స్పర్శచేఁ ద్రివక్రకుబ్జ ప్రమదోత్తమ యయ్యెను. గోపాలకృష్ణ స్పర్శచే గోపికలకుఁ దమోగుణము తొలఁగి యనన్య భక్తి లభించెను. రామకృష్ణ పరమహంస స్పర్శచే నోరన్ వివేకానంద



స్వాముఁ వారయ్యెను. మనమేమి చేయఁగలము? అట్లుద్ధరింపఁ గలమా? అట్టిశక్తి లేదేని యిట్టి మాటలేల?

మహాత్మ గాంధిగారు తాఁకుచున్నారు. తాఁకుడనుచున్నారు గదా యందురేమో. వారు పంచములనే కాదు. అంతకంటె హీనులను బతితులను గూడఁ దాఁకుదురు. ఆపాపము పోవ నిరువదియొక్కదిన ముపవాసము జేయుదురు? సలసల క్రాఁగు నినుమును బ్రావఁగల వారు కల్లు ద్రావిననేమి? మాంసము దినిననేమి? దానికిఁ బ్రాయశ్చిత్తముగ ఘోరతపస్సు చేసి యాపాపమును బోఁగొట్టుకొందురు. మంచిజీర్ణశక్తిగలవాఁడు వృకోదరుఁడుతినెడియాహారమును జీర్ణశక్తిలేని రోగితినిన నేమగును? సాము గరిడీలు నేర్చినవారు చేయుకార్యముల మనము చేయవచ్చునా? శుకుఁడు కౌపీనములేక సంచరించెనని మనము తిరుగవచ్చునా? కొడుకునకుఁ దండ్రికిఁగల వావి వెంటనే యేర్పడలేదా? అవధూతల కది తగును. అట్టులే గాంధిగారు చేసెదరని మనము చేయుట తప్పు. ఆయన మనల బలవంత పెట్టలేదు. ఆలోచించి కార్యములు చేయుమనుచున్నాఁడు. గుడ్డి యెద్దు జొన్నలోఁ జొరఁబడినట్టు నడువ వలదనుచున్నాఁడు. ఆ హెచ్చరికను మీరేల గమనింపరైతిరి? అట్లువారు చెప్పకుండిన వారియందు దోషము చెప్పవలసియే యుండును. వలన, అధికారి బలమెఱుంగక యెవ్వరినైనఁ గార్యము

లందు నియోగింపరాదు. స్పర్శ దోషముఁ బాపుకొన శక్తిగలవారు తాఁకవచ్చును—లేక భ్రష్టులు గాఁగోరు వారు—లేక యిదవఱకే వారితో సమానులుగా నుండు వారు నట్లు తలఁచువారు దాఁక వచ్చును. కాని యితరులు దాఁక రాదు.

సమత్వమును స్థాపించుటకై యొకరు కృష్ణమూర్తి యర్జునునకు యశోదకుఁ గనఁబఱచిన విశ్వరూపమును గుఱించి ప్రసంగించిరి. ఇది వీరి వాదము నెట్లు రక్షించునో యెఱుంగను. బాహ్య ప్రపంచమంతయు కృష్ణునందువారు గాంచిరి. దీని వలన వర్ణాశ్రమ ధర్మములు లేవని యెట్లు సిద్ధాంతము సేయనగు? అర్జునుఁడు చూచినది యేక తత్త్వము కాదు.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా
అపశ్యన్ దేవ దేవస్య, శరీరే పాండవ స్తథా॥

నానా విధములుగ విభక్తమైన ప్రపంచ మంతయు నొక్క చోటనే కృష్ణ శరీరమందు నర్జునుఁడు చూచెనఁట. ఇట్లు కానవచ్చిన వారిలో నానా భేదములు గల దేవతలే గాక క్షత్రియుఁడైన భీష్ముఁడు, బ్రాహ్మణుఁడైన ద్రోణుఁడు, శూద్రుఁడైన కర్ణుఁడు, మఱియు నానా యోధులు సర్వ సైన్యములు కానవచ్చెను. యవనులు రాక్షసులు కూడ యుద్ధరంగ మందుండిరి కదా. ఈ



రూపము సమత్వము నెట్లు స్థాపింపఁగలదు. ఇట్టిదే యశోద కనిన రూప విషయమున నూహించునది.

రాజాను మతము ధర్మమనియు రాజు పంచముల యెడఁ బ్రీతి వహించి యుండ మనము ప్రీతి వహింప వలదా యని యొకరనిరి. ప్రీతి వలదని యెవరనిరి? ప్రీతి లక్షణము స్పర్శమాత్రమా? స్పృశింపమి యప్రీతిలక్షణమా? రాజు పంచముల యెడ నిక్కమైన ప్రీతి వహించి యున్నాఁడా? లేక భేదోపాయ మవలంబించి యున్నాఁడా? ఇంతకు నీ దేశమునకు రాజెవ్వఁడు? ఆయన యెందున్నాఁడు? మనకై యేమి చేయుచున్నాఁడు? పార్లమెంటును గాదని యేమైనఁ జేయఁగలఁడా? ప్రభువులు చేయు కార్యము లన్నియుఁ బ్రజల కంగీకార్యము గానున్నవా? అటులుండెనేని సాహాయ్య నిరాకరణ ఘోషయేల? రాజానుమతము ధర్మమేని వీరి కీపద్యము కానుకగ నర్పించెదను.

కం॥ రాజాను మతము ధర్మము
రాజు నిశాకరుఁడు మీకు బ్రాహ్మణులారా
రాజు చరించిన క్రియఁ జే
రోజం గురు తల్పగమన ముచితము మీకున్॥

శృం. నైష.

ఇంద్రమతంగ సంవాదమొక రుదాహరించిరిగాని దానివలన బ్రాహ్మణ స్త్రీ యందు శూద్రునకుఁ బుట్టిన

వాఁడు చండాలుఁ డగునని యున్నది కాని వేఱేమియు నస్పృశ్యతాస్పృశ్యల గుఱించి లేదు. ఆవులను గాలితోఁ దన్నుట చండాల కృత్యమని తెలుపుచున్నది.

ఒకరు రంతిదేవుని గుఱించి ప్రశంసించిరి. ఇదియు వీరివాదమున కాధారము కాఁజాలదు. అన్నదానమున కెవ్వరర్హులనిన నాఁకలి గొన్నవారనియు నాఁకలి గొని వచ్చిన చండాలునకైనను గుక్కకైనను నన్నమిడ వలసినదనియు శాసించి దానికి లక్ష్యముగ నిది చెప్పఁబడినది. అంతియకాని రంతిదేవుఁడు చండాలుని స్పృశించినట్లు చెప్పఁబడలేదు.

శ్లో॥ "చాతుర్వర్ణ్యం మయాసృష్టం, గుణకర్మ విభాగశః" యని యుండఁ బంచమజాతి యెచ్చటనుండి వచ్చెనని యొకరు తర్కించిరి.

"చత్వారో వర్ణాః బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రా" యనియు "క్షత్రియ వంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనఁగా దగు నాలుగు జాతులన్" అని యుండుటయు,

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణాద్విజాతయః। చతుర్థ ఏకజాతిస్తు, శూద్రో, నాస్తితు పంచమ" యని యుండుటయు నే నెఱుంగుదును.



ఆర్యులారా! మయాసృష్ట మనఁగా నేపరబ్రహ్మమూర్తి కృష్ణుఁడుగా నవతరించెనో యాయనయే నాలుగు వర్ణముల వారిని సృష్టించెనని యర్థమా? లేక యర్జునునితో మాట్లాడు యాదవుఁడైన కృష్ణుడు ద్వాపరమందు సృజించెనని యర్థమా? భగవంతుఁడీ నాలుగు వర్ణముల వారిని మన హిందూదేశమందే సృష్టించెనని యర్థమా? ఈ విషయమేల వీరు విశదీకరింపరైరో? డాక్టర్ ఆనిబిసెంటు గారి (Eastern Castes and Western Classes) అను చిఱుపుస్తకమును జూడఁ గోరెదను. విస్తరమేలగాని వేదములు నాలుగనియే కదా ప్రసిద్ధి. "అట్లుండ భారతః పంచమో వేదః" పంచమ వేదమై పరఁగు భారత సంహితయని యైదవ వేదమెచ్చట నుండి వచ్చెను? బ్రహ్మకు నైదు తలలుండిన నాఁడు పుట్టెనందురా? పంచమ వేదమనఁగా మాలవేద మనరు కదా? భారతములో నుండు విషయమేది? నాలుగు వేదములలో నుండు విషయమే. వేదములు చదువ నధికారము లేనివారికి వానిలోనుండు విషయములు తెలియుటకై మహాభారతము రచియింప బడియె. అట్టులే నాలుగు వర్ణములందు నుండుటకు యోగ్యతలేని భ్రష్టులు క్రూరకర్ములు పంచములైరి. వారిగుణమునకుఁ గర్మమునకుఁ దగినవృత్తి వారికీయఁబడియె. "స్యాచ్చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేనయః వేదాక్షర విచారేణ శూద్రః శ్చండాల తాం వ్రజేత్ యతీనాంశోపి చండాల" యని యీవిధముగ నాలుగు వర్ణముల వారిలో ఘోర

కార్యములు చేసి యావర్ణమునుండి బహిష్కరింపఁ బడిన వారెల్లఁ జండాలురైరి. ఇప్పు డిట్టి వారు లేరా యందురేమో. ఉండవచ్చును. వర్ణాశ్రమ ధర్మములఁ గాపాడు ప్రభువు లేఁడు. కావున భ్రష్టులు బహిష్కరింపఁబడక యున్నవారు.

శూద్ర స్త్రీయందు సంతానము గాంచు బ్రాహ్మణుఁడు శూద్రుఁడగుచున్నాఁడు. వీఁడు మరల బ్రాహ్మణ స్త్రీని వివాహమాడి కుమారులఁ గాంచెనేని వా రేజాతి వారగుదురు? పదునాలుగు పదునైదు సంవత్సరముల వఱకు నుపనయనము లేని బ్రాహ్మణులును, నుపనయనమయినను సంధ్యావార్చని బ్రాహ్మణులు నేవర్ణము వారగుదురు?

క్రొందఱు పరిణామ క్రమము వలన గ్రమక్రమముగ నుత్తమ గతిని బొందుదురు గాని దేహి నీచగతికి రాఁడందురు, అదిపొరబాటు. చెట్టెక్కు వాఁడు కాలో చేయియో జాఱిన గ్రిందఁ బడునట్లు, ప్రవాహము పాఱుచున్నను నొడ్డుననుండు నీరు కొన్ని చోట్ల నెదురు పారునట్లుత్తమ జాతివారు కర్మభ్రష్టులై నీచజాతుల జన్మింతురు. భరతుఁడు జింకగాఁ బుట్టలేదా? ధర్మవ్యాధ విదురు లెవరు? ఇట్టి దృష్టాంతము లనేకములు గలవు. బ్రాహ్మణ్యము సంపాదించు టెంత కష్టమో దానిని రక్షించుకొనుట యంత కంటెఁగష్టము.



యోనిమన్యే ప్రపద్యంతే, శరీరత్వాయ దేహినః
స్థాణుమన్యేను సంయంతి, యథాకర్మ యథాశ్రుతమ్.

కఠోప నిషత్తు.

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః
నాకస్యపృష్ఠే తేసుకృతేను భూత్వేమం
లోకం హీనతరం వావిశంతి॥

ముండకోప నిషత్తు.

ఇప్పటి పంచముల పూర్వులేనాఁడో చేసిన పాపఫలమిప్పటివా రనుభవింప వలయునా? వీరట్టి పాపముచే యలేదుగదా యందురేమో. సత్యమే నాలుగు వర్ణముల వారిలోఁ గర్మచండాలు రున్నట్లు పంచములలో నుత్తమజాతుల యందుండఁ దగిన వారుందురు. లేకపోరు. ఇప్పుడు బైబిలు చదివిన వారిని మీరడిగితిరేని ఆడమ్-ఈవ్ అనువారి యాదిమ పాపము (original sin)నకు మన మనుభవించు చున్నామని చెప్పుదురు. వంశ పరంపరాగత మనునది యొకటి కలదుకదా. ఇంతకుఁ గులమందు జన్మము దైవాయత్తము. మనముచేసిన పుణ్యపాపములకొలంది నేదేశమున నేకాలమున నేకులమున నేవంశమున నెవరికడుపునఁ బుట్టిన మనముచేసిన పుణ్యపాపఫల మనుభవింతుమో యట్టి దేశకాలవంశ గర్భములందు భగవంతుఁడు మనల జనింపఁజేయును. ఉత్తములు

భ్రష్టులై యధము లగుటయే కాక పరిణామ క్రమమున నధమస్థితియందుండు మృగ పశ్వాదులును మనుష్యులుగా బుట్టు నపుడు మనుష్యులయం దధములుగాఁ బుట్టి క్రమ క్రమముగ బుణ్య బలమున నుత్తమ జాతివా రగుదురు. ఇది బడిపిల్లవాండ్లు తరగతులు మాఱినట్లే.

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" యని యుండుటచే నాలుగు వర్ణము లేక కాలమునఁ గలిగినవని భావింపరాదు. సృష్ట్యాదియందు బ్రాహ్మణ వర్ణమొక్కటియే యుండెను. అనఁగా సమస్త జనులు బ్రహ్మజ్ఞాన సంపన్నులయి సత్త్వగుణ పూర్ణులై యుండిరి. కాల క్రమమున రజస్తమో గుణములు ప్రవేశించెను. అప్పుడు జనుల గుణములు కర్మములు వాని ననుసరించి మాఱఁజొచ్చెను. కావున క్షత్రియులు లోనగు తక్కిన వర్ణములవారు నేర్పడిరి. ఏర్పడిరని చెప్పితినిగాని సృష్టింపఁబడరని చెప్పలేదు. అట్లనుటచే నిప్పుడున్న జనులందు రజోగుణ మెక్కువగను సత్త్వము తక్కువగా నున్నవారందఱు నొక జాతిగఁజేరిరి. సత్త్వాధికులు రజోధికులతోఁ గలసి మెలసి యుండ నెట్లగును? అట్లే తక్కిన వారును దమోగుణము ప్రబలముగాఁగా నేర్పడిరి. గుణము కొలఁది కర్మము కర్మము నుబట్టి జాతియు నేర్పడెను. కలియుగమందు సత్త్వము కేవలము దుర్బలమయి తమస్సు విశేషముగఁ బ్రబలించెను. కామాతిశయమున విలోమజాతులు కలిగెను. క్రొత్త క్రొత్త



విలోమ జాతులు నేఁటికిని గలుగుచున్నవి. ఇదియే వర్ణ సాంకర్యము. సాంకర్య మెక్కువగు కొలఁది తమోగుణ విజృంభణముచే వర్ణ విభాగము చెడి వీఁడు బ్రాహ్మణుఁడు వీఁడు క్షత్రియుఁడు వీఁడు వైశ్యుఁడు వీఁడు శూద్రుఁడునని చెప్పుటకును నీవర్ణము వారని నిర్ధారించుటకును లేక పేరులేని వర్ణమొక్కటి యేర్పడును. అప్పుడెవరో యెక్కడనో తప్పఁ దక్కిన వారందఱు నొక్క విధమైన నడవడిగల వారుగనే యుందురు. అయినను నూటికిరువది యైదుగురు ధర్మచిత్తులు సత్త్వగుణులు నుందురుకాని లేకపోరు. ఇతర గుణములతోఁ గూడక యే గుణము కేవలముగ వర్తింపదు. ఒక పాదము ధర్మము మిగిలి యుండును. కావున నప్పుడు కల్కి యవతరించి వారివారి గుణ కర్మములఁ బట్టి నాలుగు జాతుల నేర్పఱచును.

సీ॥ సత్య క్షమా దమ శౌచ దయా తపో
దాన శీలంబు లెందేనిఁ గాన
నగుచట్టి వాఁడు బ్రాహ్మణుఁడు; సుఖంబు దుః
ఖము నైనయెడ విమోహమును బొంద
కునికియు వాసికి నుత్తమంబగు విద్య;
యునిన నీచెప్పిన యగ్గుణములు
క్రిము శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడు గా నేర్చునే నిజము విడిచి

గీ॥ నట్టులయిన బ్రాహ్మణాది వర్ణ విభాగ
మెట్లు గలుగునయ్యా! హీనుఁ ధిక
లను వివేకమది యపార్థకం బగుఁగాదె.
యనిన ననియె నంత కాత్మజుండు

వ. ప్రమాదంబున వర్ణ సంకర మైనప్పుడు వర్ణ పరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱు వేఱు స్వాయంభువుండైన మనువు సెప్పె. ఇత్యాది గుణంబులు శూద్రునందుఁ గలిగెనేని వాఁడు సచ్ఛూద్రుండగుఁ గాక బ్రాహ్మణుండుగా నేర్పడే యవియు బ్రాహ్మణు నందు లేనినాఁడు శూద్రుండ యనంబడుం గావున వృత్తంబుల యుత్తమంబులు.

భార-అరణ్య-నహుష ప్రశ్నములు.

కాఁబట్టి ముసళ్ళ పండుగు ముందున్నది. జాతులు నిర్మూల మగుట నిశ్చయము. దాని ఛాయలే యివన్నియు. శ్రీమద్రామాయణ మాహాత్మ్యమను గ్రంథము నఁ గాఁబోలు గలియుగంబున రాక్షసులు బ్రాహ్మణ వంశముల ధ్వంసము చేయుదురనియు వారి నడవడులఁ బట్టి వారిని గుర్తింప వలసి యుండుననియుఁ జదివి యుంటిని. కాల పరిణామ పద్ధతిని దప్పింప బ్రహ్మయు శక్తుఁడు గాఁడు. ఆయన వచ్చి యడ్డము పడినను సాంకర్యము కాక నిలువదు. మన దేశమునకు ముందు రాఁబోవుగతి భారతమున నిట్లు చెప్పఁబడినది.



తే॥ ఇవ్విధంబున ధర్మంబు లెల్లనపగ
తమునఁబడ్డ, జనులెల్లను దల్లడిల్ల,
బహువిధోత్పాతములు పుట్టఁ బార్థివేంద్ర
కడఁగి తత్కాలికాల సంక్షయమునందు

కం॥ క్రమమున రాష్ట్రములును నగ
రములును నాశంబు నొందు రక్షాచ్యుతులై
భ్రమియింతురు జను లతిదు
ర్గమ గిరి సరిదంతికములఁగడు నాతురులై॥

కావున నివియన్నియు రాఁగల తుపానను దెలుపు నెల గోలు గాలులని తలంపవలయును. చెండు నేల దగిలి నఁగాని మీఁది కెగురదు. నెత్తురుగడ్డ పూర్ణముగ బక్వమైనఁగాని పగులదు.

ఇది యప్రస్తుత మేని క్షమింతురు గాక. భవిష్యత్తును విడిచి ప్రకృత మనుసరించెదను.

అయ్యా! నీవు విషయము నొక కంటనే యొక ప్రక్కనే చూచుచున్నావు. పంచములు క్రైస్తవుల పాలయి పోవుచున్నారు. పంచములిప్పు డేడుకోట్ల జనులున్నారు. ఈ యేడు కోట్ల జనులు క్రైస్తవు లయినచో మనకు నష్టి కాదా? ఏ విషయమందును క్రైస్తవులు క్రైస్తవ పక్షము నవలంబింతురు. కాని మన పక్షము నవలంబింతురా? స్వరాజ్యమునకయి కలహములు

జరుగుచుండు సమయంబున నిందర సాహాయ్యమును మన
ము తొలఁగఁ ద్రోయవచ్చునా? తురుష్కులు బలవంతు
లు. మనము దుర్బలులము. వారును మనము కలసి
మెలసి యుండవలదా? మనము దుర్బలుల మని కదా
వారు మనల నందఱుఁ బరాభవించుచున్నారు. మన ప
క్షమున నేడు కోట్ల జనులు తగ్గిన మనము మఱి బలహీ
నుల మగుదుము కదా? తురుష్కుల కెదురుద్దిగా మన
ము వీరిని నిలుపవచ్చును గదా? ఇప్పుడు పంచముల లా
లించి వశపఱచి కొంటిమేని మన జనసంఖ్య తగ్గక యుం
డును. మనకు మన దేవాలయములకుఁ దురికలవలని
భయము లేక సుఖముగ నిద్రింప వచ్చును. ఈ విష
యమాలోచింపక పలుకుచున్నావు అని మీరడుగ
వచ్చును.

ఆర్యులారా! మీరు నన్నుఁ దొలుత నడిగినది
౧. అస్పృశ్యత గలదా? ౨. పంచములఁ దాఁకవచ్చు
నా కూడదా యనియే కదా. రాజ్యతంత్ర మాలోచిం
చి ప్రత్యుత్తర మీయఁ జెప్పరైతిరి కదా. కావున ను
త్తమ జాతులవారు పంచములఁ దాఁకుట యొప్పు తప్పా
యనియే చర్చించుచున్నాను. తాఁకమి వలనఁ గలు
గు నష్టములు మీరు చెప్పితిరి. వానికి సమాధానము చె
ప్పి యావల దాఁకినఁ గలుగు నష్టిని జెప్పెదను. రెం
డును విని మీ యిష్ట ప్రకారము వర్తింపుఁడు. ఆ స్వా
తంత్ర్యము మీకుఁ గలదు కదా. మీరు చెప్పిన విష



యము లన్నియు స్వరాజ్య కాముకు లాలోచింప వలసిన
వే. స్వరాజ్యము రాజ నీతి ననుసరించి సాధింపవలసిన
ది. దానిని గోరువారికి ముఖ్యముగ దృష్టి యర్థ లాభ
మునందే యుండును. "ఎట్లు ధనము లభించును, ఎ
ట్లు మన కామము తీరును" అనియే వారాలోచించు
చుందురు. ధర్మము మోక్షసాధనము—ధర్మము వలన
నే యర్థ కామముల సాధింపవచ్చును గాని యంతటి
యోర్పు శ్రద్ధలేనివారు రాజనీతి ననుసరింతురు.

రాజనీతి వేశ్యానీతిసమానములు. ధర్మమంతయు రాజ
నీతి గావచ్చును గాని రాజనీతి యంతయు ధర్మము కాఁ
జాలదు. కావున వ్యవస్థ చెప్పక రాజనీతి మతధర్మము
ల భిన్నములనుట యొప్పఁదగినది కాదు. ఎట్లన.

కం॥ తఱియగు నంతకు రిపుఁదన
యఱకఁ బెట్టుకొని యుండునది తఱియగుడున్
జెఱుచునది ఱాతి మీఁదను
వఱలఁగ మృద్ఘటము నెత్తి వైచిన భంగిన్

చం॥ తడయక సామభేదముల దానములన్ దయ తోడ
నమ్మఁగా నొడివియు, సత్యమిచ్చియుఁ, జనుల్ జన
నాథ కృతాప రాధులన్ | గడఁగి వధింపఁగా ననుట
కావ్య మతంబిది గాన నెట్టులుం| గడుకొని శత్రులం
జెఱుపఁ గాంచుట కార్యము రాజ నీతిమై॥

ఈ సేతలు ధర్మములు కాఁగలవా? ధర్మరాజు స్వరక్షకు స్వజన రక్షకు రాజ్యలాభమునకునై నెపముఁ బెట్టి బొంకెను. ఆఫల మప్పుడే యనుభవించెను. ధర్మము విడనాడి రాజనీతి నాశ్రయించిన ఫలము గంటిరి గదా. శత్రువుల దండు నడుచు మార్గములో నుండు జలాశయములందు విషము గలుపుట రాజనీతి. అది ధర్మమగునా? కావున నవ్యవస్థగ రాజనీతి మతధర్మము నొక్కటి కాఁజాలవు. సమయాను సారము పొమ్మనునది రాజనీతి. "నజాతు కామా న్నభయాన్నలోభాత్ ధర్మం త్యజేత్ జీవిత స్యాపి హేతో" యనునది ధర్మ పద్ధతి.

ధర్మ విచారమందు రాజనీతి ప్రసంగమే తగదు.
ప్రథమనష్టి, పంచము లందఱు క్రైస్తవు లగుట.

ఇట్లగుటకుఁ గారణమేమి? ఉదర పోషణార్థమా? మన మతముకంటెఁ గ్రైస్తవ మతము శ్రేష్ఠమనియా, క్రైస్తవులయిన పంచములకు స్వమత జ్ఞానములేదు. పర మత జ్ఞానము లేదు. ఉండెనా మనమతమే శ్రేష్ఠమని నిశ్చయింపక మానరు. ఉత్కృష్టులైన మత బోధకులే తమ క్రైస్తవ మతము వదలి కొందఱు వదలఁ జాలక మన మతప్రకారము సవరించుకొని కొందఱు విజ్ఞు లగుచున్నారు. మనవారు క్రైస్తవు లగుటకుఁ గామినీ కాంచనములు కారణములు. అందుఁ బంచములు భ్రష్టు లగుటకుఁ గాంచనమే కారణము. తరువాత చేటు చేసి



నను దమ మతముతోఁ గలియు వఱకు వలసిన ధనమిత్తురు. ఆశలు చెప్పుదురు. ఉడుపులిత్తురు. తమతోడఁ ద్రిప్పుదురు. ఈ యుపచారములకు బేలుపోయి పంచములు భ్రష్టు లగుచున్నారు. అందు మాలలుమాత్రమే మాదిగలను జేర్చుకొనరని వింటిని. కావునఁ బంచములకు స్వమతజ్ఞాన జీవనోపాయము గలిగించిన మేలు గలదు గాని తాఁకివంత మాత్రమున మేలులేదు.

ద్వితీయనష్టి, స్వరాజ్య లాభమున సహాయులు కాక మానుకొనుట. ఇది మొదటిదానిపై నాధారపడియున్నది. మొదటిది చక్కఁబడిన నిది చక్కఁబడును. తృతీయనష్టి. మహమ్మదీయుల కెదురుద్దిగ నుండక పోవుట. మనము దేహబలహీనులమేని వారు విద్యాబలహీనులు. వారుమనతో సము లగుటకై యెక్కువ విద్యావ్యాసంగము చేయుచున్నారు. అట్టులే మీరు దేహబలమున హీనులని తోఁచిన దేహబలము సంపాదింపుఁడు. మీయిండ్లపైకి దురుష్కులు వచ్చి ధనము లపహరింపునపుడు పంచముల వెదకుగొనుచుఁ బోయెదరా? మీకే దేహబలము ధైర్యము గలవని తెలిసిన వారు మీపైకి రానైన వత్తురా? పిఱికి పందలని కదా వారు పైబడి వచ్చెదరు? బాలుఁడు మాయమ్మతోఁ జెప్పెదనని స్త్రీలు నామగనితోఁ జెప్పెదనని బెదరించునట్లు మీరు ను మాపంచములతోఁ జెప్పుకొందుమని తురకల బెద

రించెదరా? తురక పిల్లవాఁడు వీథిలో నితర బాలురతోఁ గలహించి యోడిపోయి యింటికివచ్చిన యెడలఁ దల్లియుఁ దండ్రియు "ఛీ బేమాని దెబ్బలుతిని వచ్చితివా కొట్టి రావలసి యుండెను లేదా యక్కడనే చావ వలసి యుండెను." అని తురకలు తిట్టుదురు కొట్టుదురు. వారును వానికి సహాయ పడుదురు. హిందూ బాలుఁడు కలహమున జయించివచ్చినను "నీవేల కలహించితివి వాఁడు తిట్టగానే నీకేమి వాసి మొక్క పోయెను" అని దూషింపఁ బడును. ఇది తారతమ్యము. మీ స్త్రీలు మీరు పురుషులను భ్రాంతి మీసహాయ్యము కోరుదురు. మీరు పంచముల నాశ్రయించితిరేని స్త్రీలకు మీకు నేమి భేదము. కావున స్వరక్ష సలుపుకొనుటకై మీరే దేహబలము నార్జింప వలయును గాని యితరులపై నాధార పడియుండ రాదు. If you want peace be prepared for war. అనుట స్మరింపుఁడు.

శ్లో॥ విద్యావినయ సంపన్నే, బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకేచ, పండితా స్సమ దర్శనః॥

అని భగవద్గీత యందుండఁగా భేద దృష్టిఁ జూచుట తగునాయని యొకరనిరి. విద్యావినయ సంపన్నుఁడైన బ్రాహ్మణునందు, గోవునందు, నేనుఁగునందు కుక్కయందు దాని వండితిను మాలనియందు సమదృష్టి గలవారు పండితులు. పండితులు వీని నన్నిటిని సమదృష్టి



తోఁ జూతురని యర్థము. సమదర్శులనగా సర్వము సమమను జ్ఞానము గలవారు. దర్శన శబ్దము జ్ఞానార్థమునఁ బ్రయుక్తము. పండితులనఁగా జ్ఞానులు.

శ్లో॥ బహూనాం జన్మనామంతే, జ్ఞానవా న్మాంప్ర
పద్యతే। వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదు
ర్లభః॥

సర్వము వాసుదేవుఁడే యనుజ్ఞానము గలవాఁడు నన్ను బొందుచున్నాఁడు. అట్టి మహాత్ముఁడు మిక్కిలి దుర్లభుఁడు—మీఁదఁజెప్పఁబడిన పండితుఁడే యీ మహాత్ముఁడు దీనివలన బ్రాహ్మణాదులను శునక శ్వపాకులను వాసుదేవాత్మకబుద్ధిఁ జూడవలయు ననిగాని బ్రాహ్మణుఁడని శ్వపాకుఁడని చూడరాదు. ఏపదార్థమును జూచినను వాసుదేవాత్మక మని తోఁప వలయును గాని వేఱు తలఁపు రారాదు. జ్ఞానీత్వాత్మైవమేమతం అని యిట్టి జ్ఞానియే చెప్పఁబడెను. ఈ విషయమునే ప్రహ్లాదుఁడిట్లు చెప్పెను.

ఉ॥ ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపల
న్ద్రెళ్ళక వారుమేమను మతిభ్రమ ణంబున భిన్నులై
ప్రవ। ర్తిల్లక సర్వ మున్నతని దివ్యకళా మయమంచు
విష్ణునం। దుల్లముఁ జేర్చి తారడవి నుండుట మేలు
నిశాచరాగ్రణీ.—

అధికారమునకు మించిన కార్యములు చేయరాదు.

తాఁకిన నేమికీడు.

తాఁక రాదని మాత్రము చెప్పుచున్నావు కాని తాఁకిన నేమికీడు మూఁడునో చెప్పక యున్నావని మీ రడుగుదురని యెఱుంగుదును. వినుఁడు.

Animal magnetism Personal magnetism అనఁగా మీరును విని యేయుందురు. ఈ శక్తికి సంస్కృతమునఁ బ్రాణశక్తి యని పేరు. ఊరక ప్రాణమనియు నందురు. లోకమున సమస్త కార్యము లీ ప్రాణశక్తి వలననే జరుగుచున్నవి. నడచుట—పలుకుట—చూచుట—వినుట—దేహము లందు నెత్తురు పాఱుట నాడులు కొట్టుకొనుట—నీళ్ళు పాఱుట—నిప్పు మండుట, గాలి వీచుట యిదియది యననేల సమస్త కార్యములు దానివలననే జరుగుచున్నవి. ప్రాణశక్తి పోయెనా దేహము నశింపఁ బ్రారంభించును. నిప్పు మండదు—గాలి వీవదు. సమస్త చైతన్య చిహ్నము లన్నియు మాయమగును. ఈ శక్తి గాలి నీళ్ళు లోనగు సమస్త పదార్థములందు నున్నది. గాలియందున్నది. ఆకాశమున నున్నది. నీళ్ళయందున్నది. ఇదిలేని స్థలమే లేదు. ఇది ప్రాణవాయువునకుఁ బ్రాణము. ఆక్సిజన్ కాశక్తి దీనివలన వచ్చినదే. వైద్యుతశక్తి లోనగు నానాశక్తులు దీని పరిణామములే. అదియొక్కటే నానా నామముల వర్తిం



చుచుండును. ఇదియే దేహము నందెంత యెక్కువగ నుండునో తేజస్సు—వీర్యము—మేధ—వర్చస్సు ఆయుస్సత్వ బలారోగ్యములు లోనయినవంత యెక్కువగ నుండును. ఇది క్షీణించు కొలఁది దేహము దుర్బలమై క్షీణించును. వేఁడినీళ్ళ పాత్రికానుకొని చన్నీళ్ళ పాత్రినుంచిన వేఁడిమి యెట్లు చన్నీళ్ళ పాత్రమునకుఁ బోవునో యట్టులే ప్రాణశక్తి యెక్కువగానుండు దేహమునుండి తక్కువగానుండు దేహములోనికిఁ బ్రసరించును. మన మీ ప్రాణశక్తిని త్రాగెడి నీటివలనఁ దినెడి తిండి వలనఁ బీల్చెడి గాలివలన, మనోవ్యాపారము వలన ముఖ్యముగ సేకరించుచున్నాము. దీని నెక్కువగ సంపాదింపఁగోరువారు పరిశుద్ధమైన చలినీళ్ళనే త్రావుదురు. వానియందే స్నానము చేయుదురు. వేఁడి నీటియందు గాలి పోఁకని నీటియందు నీశక్తి విశేష ముండఁజాలదు. కావున నవి త్యాజ్యములు. ప్రాణాయామముచే గాలి నుండి యీశక్తిని సంగ్రహింతురు. సాత్త్వికాహారమును దినుటచే భోజన పదార్థములనుండి సంపాదింతురు. జపము—తపస్సు—భక్తి—జ్ఞానము, ఈశ్వర ప్రణిధానము సద్విషయ చింతనము లోనగు వానివలన మనస్సు మూలమున గడింతురు. సాత్త్వికములని చెప్పఁబడిన మనోవాక్కాయ కర్మములచే నిదివృద్ధి యగు చుండును. తద్విరుద్ధ కర్మములచే నిది క్షయించును. మనోవాక్కాయ కర్మములన్నియు దీనివలననే జరుగు చుండుటచే నేమి యాలోచించినను, చేతులు కాళ్ళు కద

లించినను, జూచినను, మాటలాడినను నీశక్తి క్షీణించుచుండును. జన సముదాయము లోనికిఁ బోయిన నీశక్తి కోలుపోవలసి వచ్చును. కావున నేకాంత వాసము వివిక్త జనసేవిత్వము జనసముదాయమం దరతి విధింపఁబడినది. విశేషముగ మాటలాడినను నీశక్తి వ్యర్థముగఁ బోవును గనుకనే మిత భాషిత్వము—మౌనము నియమింపఁబడినవి. వ్యర్థ చింతనము వలన నీశక్తి క్షీణించును. గనుకనే ధ్యానయోగము చెప్పఁబడిది. అంగ చలనము వలన నష్టి లేకుండ నాసన జపము నియమిత మయ్యెను. ఇట్టులే తక్కినవి యూహించు కొనునది. ఈశక్తి దేహమునం దుండుటయే కాక దేహమునకు వెలుపలఁ గొంత వఱకు వ్యాపించి యుండును. దీనినే థియాస ఫిస్టులు ఆరా యందురు. నీటియందు వేడిమి నీటియందు మాత్రమే కాక దానికానుకొని యుండు గాలియందు నెట్లు ప్రసరించునో యట్లె యిదియు ప్రాణశక్తి దేహమునందెంత విశేషించి యుండునో యంత దూరము వెలుపల వ్యాపించి యుండును. ఎండయను పేర మనకుఁ దగులునది జీవకోటుల వృక్షముల రక్షించునది సూర్యుని ప్రాణశక్తియే. తమ దేహముల నుండు నీశక్తిని రోగుల దేహములందుఁ బ్రవేసింపఁ జేసియెడల నెట్టి రోగములైన మానును. ఇదియే మందులేని చికిత్స. సంధ్య వార్చుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లీశక్తిని విశేషముగ సూర్యునుండి గ్రహింతురు. భర్గో దేవస్య యీశక్తియే. తేజస్వీభూయాసం వర్చస్వీ భూయాసమ్



అను వాక్యముల ఫల మీశక్తి వలననే కలుగును. కాస్మిక్ ఎనర్జీ యీశక్తియే. ఈశక్తి వలననే సృష్టి స్థితి ప్రళయములగును. మనము ఋషిగోత్ర సంభవులము. పిత్రార్జిత ధనము వంశ పారంపర్యముగ వచ్చునట్లే యీ ఋషుల తేజస్సు మనయం దింకను శేషము నిలిచి యున్నది. ఆనకట్టలను దాఁటి వచ్చు మహా ప్రవాహమువలె బురుషులు దురాచారులైనను స్త్రీలు వర్ణసంకర కారిణు లయినను గొంతకుఁ గొంత మన దాఁక నల్పమో స్వల్పమో వచ్చి యున్నది. ఇంక గొన్నాళ్ళకు మూలమట్టుగ నశించును. అందఱు నేక మగుదురు. దానికే యిప్పుడీ గందర గోళము.

ఈ ప్రాణశక్తి పాలవంటిది. రాగి పాత్రలోను సీస పాత్రలోను బోసిన పాలు విషమగును. అవి త్రావిన వారిని వ్యథపెట్టును. అట్టులే యీ ప్రాణశక్తి యనాచారులు దురాచారులు క్రూరులు కోపనులు నభక్ష్యభోజనులు ఘాతకులు లోనగు వారియందుఁ బ్రవేశించి చెడును. ఒక్క విధమైన పచ్చిగడ్డినే యావునకు గుఱ్ఱమునకు వేసిన నావుపేఁడ యెట్లుండునో గుఱ్ఱపులద్దె యెట్లుండునో చూడుఁడు—అట్టులే యీ ప్రాణశక్తియు. కస్తూరి తన పరిమళమును వ్యాపింపఁ జేసినట్టే యమేధ్య వస్తువులు తమ గబ్బును వ్యాపింపఁ జేయును గదా? కస్తూరిని నుల్లిగడ్డను నొకచో నుంచిన నేమగును? అట్టులే సదాచారుఁడు దురాచారుఁడు

నొకచోటఁ దాఁకి నిలిచిన నగును. నీకు స్వారాజ్యము కావలయునా? ఈ ప్రాణశక్తి కావలయునా యందు లేని రెండును గావలయు నందును. ఏదైన నొకటి కోరుమనినఁ బ్రాణశక్తియే విశేషముగఁ గావలయు నందును. వలసినంత ప్రాణశక్తి నేను గడించితినేని కూర్చుండిన చోటన యుండి మూఁడు ముక్కాలు గడియలో స్వారాజ్యము సంపాదింపఁ గలను. ప్రాణశక్తి మహాత్త్వము నెఱింగిన వాఁడు ప్రాణాపాయము వచ్చినను దానియందు లవమైన వ్యర్థపఱుపఁ జాలఁడు. కావుననే పూర్వమున ఋషులు రాక్షసులచేఁ జావనైనఁ జచ్చిరి. కాని శపింపరైరి. శపింపవలయు ననినఁ గ్రోధముపాలు పడవలయును. కామమున నగు వ్యయము కంటె గ్రోధమున నీ శక్తి విశేషముగ వ్యయమగు. రామునితో ఋషీశ్వరులు చెప్పిన వాక్యములు స్మరింపుఁడు. ఈ శక్తిగల భీష్మ ద్రోణాశ్వత్థామాదులను రాజులందరు నేకమై వచ్చియు వ్రేలు వంపఁ జాలిరా? ఇట్టి శక్తిని సంపాదించుకొనుటకు మాఱు మఱి మఱి నికృష్ట దశకుఁ బోవఁ జూచువారికై యేమని వగతును? కలి మహిమ. కాల మహిమ.

ఈ శక్తి దేహము కొన భాగముల నుండి యనఁగాఁ గాలి వ్రేళ్ళు చేతి వ్రేళ్ళు వీనిమూలమున విశేషముగ వెలుపలఁ బోవును. కావుననే దురాచారుల కరగ్రహణము (Shake hand) సర్వథా దుష్టము. ఈ కా



రణము చేతనే పెద్దలు పిన్నల నాశీర్వదించునపుడు తలపైఁ జేయి యుంచుదురు. పెద్దలకు నమస్కరించునపుడు పాదముల వ్రాలి నమస్కరింతురు. సాధారణముగా నీ శక్తియందు దృష్టిగలవారు తమ పాదములను నితరులంటనీయరు. విధి లేక దాఁకవలసి వచ్చినపుడు పట్టువిషపులు తెలిసినవారు సాధ్యమైనంత వఱకు వెలుపలఁ బోనీయక బిగింతురు. దేహములోని శక్తి వెలుపలఁ బోనీయక వెలుపలి విషశక్తి దేహమునకుఁ దగుల నీయక కొంతవఱకు వస్త్రములు రక్షించును. వీని కంటె శ్రేష్ఠములు నార గుడ్డలు. వీనికంటె నుత్తమములు వెంట్రుకలతోఁ జేయఁబడిన గుడ్డలు. వీనికి మిన్నలు పట్టువస్త్రములు. ఆవికంతు సదాశుచియని ప్రమాణము. మైల సోఁక దేని పట్టు వస్త్రము పది దినములవఱకు శుచి. దూది గుడ్డ లొక రాత్రి మాత్రమే. రాత్రియెండ వేసినవి పగటిపూటఁ గట్టుకొనుట యనాచారము. పగటి వేఱు రాత్రి వేఱు వస్త్రముల ధరింపవలయును. కంబళ్ళను నెండలో వేసి జాడించిన శుద్ధియగు. కావుననే కదా వల్కలాజిన కుశావళులు లేకున్నవే కట్టుదుకూల సంఘంబు లేల? యని భాగవతమునఁ జెప్పఁబడెను. వస్త్రములు కట్టుకొనునపుడు చుంగులు కొంగు కొనలు తోకలు భూమికి సమీపమున నుండునట్లు కట్టరాదు. ఈ కొనలనుండి దేహములోని శక్తి భూమిలోనికిఁ బోవును. కావున వైష్ణవులు వైదిక నిష్ఠాపరులు పంచకచ్ఛ పోసి దోవతుల ధరింతురు. సాధువులు కట్టు పద్ధతియు మం

చిదే. కేవల కౌపీన ధారణము మేలే. స్త్రీలు పైఁట కొంగు నడుమునందుఁ జెక్కుట యీ కారణమునకే. మిటారి కత్తెలు నిడివి పైఁటలు వ్రేలవిడుచుట మంచిది గాదు. ఈ శక్తిని రక్షించు కొనుటకై మన పెద్ద లెంతగఁ బాటుపడి యాలోచించి యాచారములు గల్పించిరో తెలియుటకై యింత దూరము చెప్పితిని. ఇవన్నియు మీరాలోచించిన నస్పృశ్యులు పంచములు మాత్రమే కాదు. అనాచారులు దురాచారులు కులభ్రష్టులు నస్పృశ్యులే. శీలముఁబట్టి యోగ్యత. కావున మిత్రులారా! మీ యోగ్యత దెలిసి వర్తింపుఁడు. కన్నులు మూసికొని గోతిలోఁ దుముకకుఁడు. పంచముల మంచి సితికిఁ దేవలదని నేను జెప్పను. వారి యందలి నా ప్రీతి మీపైప్రీతికంటెఁ దక్కువ యైనది కాదు. వారికై యార్య ధర్మవర్ధని పరీక్షలందు బహుమానముల నేర్పఱిచితిని.

శ్లో॥ విసృజ్య స్మయ మానాన్ స్వాన్, దంభం లజ్జాంచ దైహికీమ్। ప్రణమే దీశ్వర కళా, మాశ్వ చండాల గోఖరమ్.

అను కృష్ణోపదేశము ప్రమాణముగఁ గొని పంచములకే కాదు. అంతకంటె నికృష్టులకును సాష్టాంగ నమస్కారము చేయుదును. కావున నేను ద్వేషబుద్ధితోఁ జెప్పుచున్నానని తలఁపకుఁడు—మీరు చెడక వారిని రక్షింపుఁడు. విద్యాబుద్ధులు శ్రద్ధా భక్తులు



జ్ఞానము నేర్పి జీవనోపాయములు గల్పించి వారిని మీఁదశకుఁ దెండు. అంతియ కాని మీరు వారి దశకుఁ బోకుండుఁడు. స్పర్శము వలన రోగములు వచ్చుటయు బోవుటయు మీ రెఱుంగుదురు. వారి తమోగుణమును మీ స్పర్శచేఁ బోవఁ దోలునంతటి శక్తి సంపాదించు కొనుఁడు. రామ కృష్ణ పరమహంసకన్న మనము గొప్ప వారము కాము.

"Now she feels a little encouraged and touches the sacred feet of the master and salutes him again. At once the master stands up uttering 'Govinda' startled and tortured as it were by a scorpion sting, and hurries up, panting to where a jar of Ganga water stands in a corner and washes those parts of his feet which the maid servant has touched. "Gospel of Rama Krishna Vol II."

"You touch my feet by way of salutation but had Bride been here who would have dared to touch my feet?—He would never have allowed it?

Page 200.

"But now I cannot do that. My spiritual mood has changed. Now the food must be prepared by a Brahmin observing the rules of ceremonial purity and it must be offered to God then only I can take it," Page 264.

పంచముల దొడ్డను దన గడ్డముతోఁ నూడ్చిన రామకృష్ణ పరమహంస యిట్లు చెప్పఁగా మన మెంత వారమో. స్పర్శము నందు గుణము కలదో లేదో

యత్త పుత్త్రాకును దాఁకి చూచుఁడు. సాలగ్రామ తీర్థము పవిత్ర మగుట కేమి హేతువు? బంగారు మణులు స్నానకాలమున దేహముపై నుండి యానీళ్ళు దేహము మీఁదఁ బాఱిన నారోగ్య కరమగుటకుఁ గారణ మేమి?

స్వరాజ్య కార్య లాభమునకై మనల నిప్పుడు చేరఁదీయు చున్నారని పంచములు తలఁచిన నిదియేమి యుపాయముగ వారెంచెదరు? గాంధిగారి శక్తి సంపాదించుకొని వారుచెప్పినట్టు చేయుఁడు. వారొక నాఁ డుపవాసముండుఁ డనిన నుండని వారున్న, కాఫీ, టీ, కోకో తిండిపోతు తనము చాలింపుఁ డనినఁ జాలింపని వారును దీనియందుఁ బరమ భక్తులై వర్తించుట కలి మహిమనే కదా? ఇదివఱకే పంచములవలె వర్తించువార లాపని చేయుచుండు. చెడని వారేల చెడవలయును? కలి పురుషా మహానుభావా నీ ప్రభావ ప్రవాహమును నావంటి గడ్డిపోఁచ యాఁపఁ గలదా?

ఇఁక నొక్క విషయము చెప్పి ముగించెదను. ఒక శాస్త్రులవారి యల్లుఁడు గారిట్లు వ్రాసిరి.

"Thou of you who know little about India cannot be aware that from the occult stand point much of India's suffering is directly attributable to her own treatment of those of her own people who are outside the pale of caste. She has treated them as "untouchables" and yet does not scruple to take the lowest of services from them. In other words, while scorning them she has not



scrupled to use them such an attitude is one of the greatest crimes against the Fatherhood of God and the Brotherhood of man."

Thoughts on at the feet of the Master.

by George S. Arundale.

యోగదృష్టిచేఁ జూచి వ్రాయువారికి లౌకిక దృష్టిచేఁ జూచు నేనేమి ప్రత్యుత్తర మీయఁగలను. నాకు యోగదృష్టి లేదు. స్త్రీ సంయోగదృష్టి లేదు. పంచములనువారు నేఁటి సృష్టియా? కృత త్రేతాయుగముల నుండి యున్నారా? అస్పృశ్యత యిప్పుడు కల్పింపఁ బడినదా? నాఁటి నుండి యున్నదా? రంతి దేవుని నీళ్ళడిగిన వాఁడెవఁడు? భ్రష్ట త్రిశంకుఁ డెవఁడు? ఏ వేషమున నింద్రుఁ డుతంకునకు నమృతముఁ దెచ్చెను. ఆనాఁడు వీరస్పృశ్యులై నేఁడస్పృశ్యు లయిరా? ఆనాఁడే యుండెనేని మొన్నటి వఱకు నన్ని యుగంబులనేల యీ దేశము బాగుండెను? దేవుఁడు తండ్రి మాత్రమే కాఁడు తల్లి తోడుకూడ. పితాత్వం, మాతాత్వం, దయిత తనయాస్త్వమ్" అని పెద్దలు చెప్పిరి. వీరి దేశములలోఁ గొందఱు నీచులుగ భావింపఁ బడుట లేదు. కాఁబోలు. భారత యుద్ధము వలన లక్షల కొలఁది స్త్రీలు విధవలైరి. కామదాసికలైన బ్రాహ్మణ స్త్రీలును రహస్యముగనో బాహిరముగనో శూద్రాదులతో రతికేళిఁ దేలఁజొచ్చిరి. వర్ణసంకర మేర్పడెను. దానివలన దేశము భ్రష్ట మయ్యెను. దీనికి భగవ

ద్గీతయే ప్రమాణము. స్త్రీల వలననే మన దేశము చెడి నది. వారి వలననే బాగుపడ వలయును." అని యిది వఱకే వ్రాసి యున్నాను. ఇప్పటికి నాయభిప్రాయ మిదియే. బుద్ధిలేని పురుషులు వారికిని దురాచారములు నేర్పి వారిని భ్రష్టులం జేయుచున్నారు.

"I Believe the men of India would have long ago been lost had it not been for the noble womanhood of India" Sir Andrew Wingate.

కావునం బూర్వ కాలపుం బతివ్రతల వంటివారు మరల మన దేశమున నేర్పడ వలయును. శ్రద్ధభక్తి నిజమైన మతజ్ఞానము వృద్ధి కావలయును. సదాచార సంపత్తి లభింప వలయును. బ్రాహ్మణ స్త్రీలు పంచములతోను దత్కుల్యులతోను రతికేళిం దేలక యుండ వలయును. సామాన్యులు స్త్రీయాలను బరిహాసించుట వింతగాదు. అందఱా దమ వలెనైనం దమ్మాక్షేపించు వాడుండును గదా?

ఉత్తమ సంస్కార లక్షణము.

("To wipe away all inequality of privilege we should try our utmost to put an end to the difference in culture between class and class—which gives rise to all invidious distinctions in our social life. This is to be achieved not by pulling down the higher caste to the level of the lower, as some of our reform movements have vainly attempted to do, but by raising the lower to the cultural level of the higher. It is the latter method which the Hindu



social system aims to follow. "The ideal of the world" says Swami Vivekananda, "is that state when the whole world will again be Brahmin in nature. When there will be no necessity of the Sudra, Vaisya, and Kshatriya powers; when spiritual force will completely triumph over material force; when love will be the only motive power in all actions on this earth, then only the whole mankind will be endowed with Brahminical qualities & attian Brahminhood. Then only distinction of caste will be at an end, entering the Golden age visualised by the ancient Rishes."

Prabudda Bharata Feb: 1924.

మరల గృతయుగంబున నిట్లయుగు.

"If you succeed in the attempt to throw off your religion and take up either politics or society, or any other thing as your centre, as the vitality of your national life, the result will be that you will become extinct.. ......So in India social reform has to be preached by showing how much more spiritual a life the new system will bring and politics has to be preached by showing how much it will improve the one thing that the Nation wants-its spirituality.")

P. Bharatta March 1924.

శ్రీ రామార్పణమస్తు.

